# భారతి

వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

డిసెంబర్ 1975

వెల: రూపాయి న్నర



# రైతు యోధులకు జేజేలు

'జయ' – అంటే ప్రజల మనోరథం మీద ఎత్తిన జయ పతాక

'సోనా' – అంటే దీక్షా స్వర్ణ కంకణ ధారణ

'రత్న' – అంటే రత్నాల రాసులవంటి కళ్లంలో పంట కుప్పలు

'జగన్నాద్'– అంటే ప్రగతివైపు పరువెత్తే జగన్నాధ రథచక్రాలు.

ఇవన్నీ వేటికి పేర్లు? ఇవి మన రాష్ట్రంలో పండిస్తున్న
**మేలురకం వంగడాలు.**

పొలాలలో హలాలతో ప్రకృతిమీద యుద్ధంచేస్తున్న
**రైతు వీరులకు జేజేలు.**

గడచిన ఏడాది రాష్ట్రంలో వరి ధాన్యంఉత్పత్తి **53.52** లక్షల టన్నులు. **1974 - 75** లో **14** లక్షల ఎకరాలకు పైగా వరి పైరు వేశారు.

సమాచార, పౌర సంబంధశాఖ, హైదరాబాద్.

No. 1/75–76

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)




డిసెంబరు 1975

సంపుటము : 52 సంచిక : 12 :

విడిప్రతిక వెల రూపాయిన్నర

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1975

# క్రాంతిహాసం

## డా॥ సి. నారాయణరెడ్డి

పగలు ముదిమితో మూల్గినప్పుడు
పక్షులు నోళ్ళ గూళ్ళు మూసినప్పుడు
గాలి కాళ్ళు చల్లారినప్పుడు
నేల ఒళ్ళు నిట్టూర్చినప్పుడు;

కనురెప్పలమీద ముదురు చీకటి
కలల చిగుళ్ళు మేస్తున్నప్పుడు
రేవనే రెమ్మకొసలో ఇరుక్కొని
రేయి కోయిల కూస్తున్నప్పుడు;

ప్రణవం లాంటి తాదాత్మ్యంలో
ప్రాణానిలం నిశ్వసిస్తున్నప్పుడు
పదంలాంటి కైవల్యంలో
ప్రపంచం పరమపదిస్తున్నప్పుడు;

అప్పుడు నా ఆగ్రహోదితం
అస్తమించని ప్రత్యూషం
అప్పుడు నా అట్టహాసం
అవధిలేని క్రాంతిహాసం.



# మన ప్రాచీన నగరములు

# మా ఊరు : రాచెర్ల బొప్పాపురము

శ్రీ బి. అచ్యుతరాజు

తెలంగాణా భాగాణమున బయల్పడిన ప్రాచీన నగరములకు సాటిగా బయల్పడ జాలునది మా ఊరు రాచెర్ల బొప్పాపురము.

మా ఊరు కరీంనగరం జిల్లా యందలి సిరిసిల్ల తాలూకాలో కరీంనగరం–కామారెడ్డి బస్సు రోడ్డు పైన గొల్లపల్లి దగ్గర సిరిసిల్ల పంచాయితీ సమితికి జెంది సిరిసిల్లకు 20 కిలో మీటర్ల దూరమున నున్నది.

ఇప్పుడున్న మా ఊరునకు పడమర ఒక కిలోమీటర్ దూరమున భూమిమీద 70, 80 ఎకరముల వైశాల్యముగలిగి ఒక కోట యున్నది. ఇది రాచెర్లకోటయనుపేర ప్రసిద్ధమై యున్నది. కోట నిర్మాణమంతయు ప్రాచీన స్థల దుర్గముల బోలియున్నట్లు శిథిలము లగు బురుజులు, ద్వారములు చెప్పక చెప్పుచున్నవి.

కోటకు నాలుగు దిక్కుల ద్వారములున్నవి. తూర్పుదిక్కున గల ప్రధాన ద్వారము పూర్తిగా కూలిపోయి జాడలు మాత్రము మిగిలియున్నది. పడమర వెనుకదిడ్డి కొంతభాగము శిథిలమై



1) బిక్క మొగంతో ఊరి దిక్కు మొగమైన కూలిపోయిన రాచెర్లకోట తూర్పు ప్రవేశ ద్వారము.

పూర్వుల నిర్మాణ కౌశలమును చాటి చెప్పుచు నిలిచియున్నది. దీనినే ఏనుగు దిడ్డియని ఈ ద్వారమునుండియే రాజాగారి పట్టపుటేనుగు పోయి ప్రక్కనేయున్న జక్కులచెరువులో నీర్మ్రాగి ఈదులాడివచ్చెడి దని జనులు చెప్పికొందురు. దక్షిణపు దిక్కున గొల్లదాని దిడ్డి



3) రాచెర్లకోట వెలుపలికి జక్కుల చెరువులోనికి దారినొసగు చక్కని నిర్మాణముగల ఏనుగదిడ్డి (వెనుకదిడ్డి)
(దినదినము శిథిలమైపోవుచున్నది)

శిథిలమైపోయినది. ఈ ద్వారమునుండియే గొల్లదొరసాని కోటలోనికి పాలు పెరుగు సరఫరా చేసెడిదనియు గోలకొండకు అబ్దుల్లా పానీవల మా రాచెర్ల కోట కొల్లగొట్టబడుటకు ఈ గొల్లనాతయె కారకు రాలైనదనియుజనులు వాడుకొనుచుందురు. (చిత్రం 7 చూడుము)

ఉత్తరమువైపున నొక ద్వారమున్న గురుతులు కలవు కాని అది భూమిలో పూడుకొని పోయినది. (చిత్రం 5 చూడుము)



7) దక్షిణము దిక్కునగల గొల్లదాని దిడ్డి శిథిలాలు దీని నిటీవల పూర్తిగా త్రవ్వుకొని పోయినారు.



) ఉత్తరమువైపుగల మాగాణి భూములు నీటితో విండిన అగడ్త చెట్టు చేమతో బలిసిపోయి పెద్ద గట్టువలె కన్పించు కోటగోడ దృశ్యము.

కోట చుట్టుగల అగడ్తలకు అక్కడక్కడ ఆసకట్టలువేసి న్నచిన్న కుంటలుగా నిర్మించుకొని వారి వారి పొలాలకు నీరుపారించు కొనుచున్నారనగా ఆ యగడ్తలెంత భారివో ఊహించుకొనవచ్చును. అట్టివానిలో పేర్కొనదగినవి 'పంటేండ్ల అగుర్త' 'భట్టోండ్ల అగుర్త' అనునవి అగడ్తలే జనవ్యవహారమున అగుర్తలైనవి.

కోటలోపలి భాగమంతయు ఇప్పుడు మెట్ట వ్యవసాయ క్షేత్రము. ఈనాటికిని కోటలోపల వెలుపల చిత్రవెటు పాతబావి బొందలు హనుమంతుని విగ్రహాలు, జైనవిగ్రహాలు రాలిగనుగలు, మంటపాలు, నందులు, వినాయకుడు, ఏనుగు, మహానాగశిల, శిల్ప శోభితమగు శిలలు, లింగలు ప్రాణవట్టాలు, స్తంభాలు దేవాలయాల శిథిలాలు, మసీదుల ఆనవాళ్ళు నిలిచియున్నవి. తరువాత నిర్మించిన



2) రాచెర్ల కోటలో ప్రవేశించగనే దర్శనమిచ్చు భక్తాంజనేయస్వామి.



4) తెల్లబాతిలో చెక్కబడి జక్కులచెరువులో ఎల్లకిలపడియున్న ఏనుగంత వినాయక విగ్రహము

దేవాలయములలో కోటలోని దేవాలయస్తంభాలు, శిల్పఖండాలు చోటు చేసికొని పూర్వపు శిల్పకళను సజీవముగా కాపాడుచున్నవి. అట్టి వానిలో పేర్కొనదగినవి ఇప్పటున్న ఊరిలో ఎప్పుడో శ్రీ ముప్ప

వరప్పు గామయ్య కట్టించిన శ్రీ కేశవస్వామి దేవాలయము; ఇటీవల 1967 లో కలికి చెరువుకట్టు పైన నిర్మించిన గంగమ్మగుడి ముఖ్యమైనవి



8) కాకతీయులనాటి శిల్పకళతో శోభిల్లు జక్కులమ్మగుడి శిల్పఖండాలతో ఇటీవల కలికి చెరువు కట్టపైన నిర్మించిన గంగమ్మగుడి.

పూర్వమిది 40 గ్రామముల పరగణా. దీనికి రాచెర్ల పరగణా అను పేరు. కోటలో రాచనగరు, పరివారము నివసించెడిదట. దీనిని [1]సింగరాజు, [2]బొప్పరాజు అనువారు పరిపాలించిరట. వారి పేరనే



6) పడమటి దిక్కునగల మిక్కిలి ఎత్తైన కోటగోడదిగువన కోట లోపలి పంటచేలు.

అక్కడ సింగ సముద్రమను గొప్ప జలాశయమును బొప్పాపురమను ఒక గ్రామమును రూపొందినదట. వారికున్న ఒక్కటే గుడ్డిగుఱ్ఱమునకు 'దినుసుకొక్క పల్లెము' అనగా మాటి మాటికి అలంకారములను మార్చుచు తేపకొక సిపాయి కోటగోడపైన స్వారి చేయువాడట. తురుష్కుల దండయాత్రలలో పెండారీలు, దోపిడిగాండ్రు వచ్చి కోట వెలుపల విడిసి యుండి ఈరోజునకెంతో అశ్వ సైన్యమున్నది. కోట వశమగుటెట్లాయని కొంతకాలము విచారించి కోటలోని గొల్లామెను మచ్చికచేసికొనగా ఆమె "ఏమున్నది! ఒక్కటే గుడ్డి గుఱ్ఱము పవాలక్షనల్లా!" అని రహస్యమును బయలు పరచెనట. అంత శత్రువులా రాత్రియే కోటను కొల్లగొట్టి సర్వధ్వంసమొనరించిరట. పాడువడిన కోటను వదలి ఇప్పుడున్న గ్రామమును పొందించుకొని జనులు జీవింపసాగిరట.

వ్యవసాయముచేసికొను రైతులకు కోటలోని తమతమ చేలలో ఇప్పటికిని బంగారు బిళ్ళో వెండినాణెమో, రాగి ముక్కయో, రామటెంకియో పూసో పోగో దొరుకుట కద్దు.

నా చిన్నప్పటిమాట. రాత్రులలో జనసంచారముండని ఆకోటలో ఒక బైరాగివాడుండెడివాడని, చిన్న దీపపు వెలుగు ప్రతము కనిపించెడిదని కొంతకాలమునకు చూడగా అక్కడక్కడ ధనపుపాతరలు గచ్చుచేసినట్టివి బయల్పడినవని అందులో ఊకమాత్రము మిగిలియున్నదని జనులు చెప్పుకొను చుండెడివారు. నా కప్పుడనిపించెడిది. అయ్యో! భగవంతుడా!! మన కెవ్వడైనా మోసమెరుగని అంజన సిద్ధుడొకడు లభించిన నెంత బాగుండెడిదో కదా యని. నేను పుట్టుటకు పూర్వపు సంగతి మరొకటి. ముప్పవరం లక్ష్మణరావు పంతులు

1 1369 AD HAS 19 WG 1 P 119 అయ్యవోలు శాసనములో రేచర్ల సింగమ నాయకుడు అతనికి 'రాయబందీ విమోచకుడు' అను బిరుదమొకటి శాసనస్థమై యున్నది.

1287 AD ఖమ్మం జిల్లా గార్ల శాసనములో రేచెర్ల ఇమ్మడి బొప్పరాయడు 'సామంతుడు' ప్రస్తావనమున్నది.

తెలంగాణా శాసనములు సం: 1.

పై రెండు శాసనములు మా రాచెర్ల కోట చరిత్రాంశములకు పనికి రాగలవేమో!

భట్టు చక్రపాణి, రామయ్యపంతులు తిప్పం గొన్నప్ప, సిందెల్లప్ప, బెస్త రాజాలు వీరంతా కలిసి కోటలో ఒక పెద్ద నిధిని కనుగొనిరట. అది వారి శక్తికి మించిన కార్యమగుట చావు తప్పి కన్నులొట్టపోయినట్లైనదట ఇప్పుడు వారందరు కీర్తిశేషులే కాని అప్పుడు అంజన సిద్ధులు, మంత్రశాస్త్ర వేత్తలూనట. చెప్పవచ్చిన దేమనగా ఇప్పటికిని యీ కోటలో కావలసినన్ని నిధి నిక్షేపాలున్నవని పెద్దలు చెప్పుచుందురు. ఇటీవల కోటలో ఒకచోట ఒకరు బావిని 8, 10 గజముల లోతు త్రవ్వించగా ఒక పెద్ద భవంతి, గోడలు, సున్నము, అలుకు-పూత దీపపు గూడులు గ్రుమ్ములు, పొయ్యిలు. బూడిద మొదలగునవి బయల్పడినవి అంటే అంతయెత్తు మట్టికప్పినదన్న మాట.

మా పూరు పైభాగమున ఒక పెద్ద జలాశయమున్నది. దాని పేరు సింగసముద్రము అది గ్రామాలలోగల మూడువేల ఎకరములకు పారును. ప్రకృతి సిద్ధముగా నేర్పడిన పెద పెద్ద గుట్టలే దాని కానకట్టలు కాగా లోతువాగు తాకిడిగల చోట చిన్నకట్ట యెంతకు నిలువకపోవుచుండగా నాటి సర్దేశాయి ప్రకటన ననుసరించి అప్పటి హైదరాబాదు నగరమునగల వెండి, బంగారు ముత్యాల వర్తకుడైన కోటె కిషన్‌దాస్ అనునతడు భూమిలోనొక తాళ ప్రమాణము, భూమిపైన నొక తాళ ప్రమాణము సీసము ఇనుము కరిగించిపోయుచు రాళ్ళను అతుకుచు గచ్చుతో 'బందిష్' నిర్మించెనట. అది నాటికీ నేటికి చెక్కుచెదరకుండ ఉండి మహా జలాశయమై నిలిచినది. బందిష్ నిర్మాణము నాటి 'చార్మినార్' నిర్మాణమును పోలియున్నది. అప్పటి ఇంజనీరుల ప్రతిభకు ఎత్తని పతాకయై నిలిచినది. తత్ఫలితముగా కోటె కిషన్‌దాస్‌కు మావూరుతో కలుపుకొని 9 గ్రామాలను 'పన్‌ఖా' గా నాటి సర్దేశాయిగారిచ్చారట. ఆయన తమ స్మారకముగా కిషన్‌దాస్‌పేట యను గ్రామమును పొందించిరట. అది యీనాడు మంచి వర్తక కేంద్రమై యున్నది.

సముద్రమునిండగా మిగిలి ప్రవహించునీరు రాచెర్ల కోటవెనుకనున్న జక్కుల చెరువులోనికి కాలువనుండి చేరును. ఆనాటి వరకా చెరువునకేమి పేరుండెనో తెలియదు. మావూరిలో అల్లాడి వంశమునకు జెందినవా రున్నారు. ఆ వంశపు కోడలిని పంపించమని ఒక యింటి పెద్దకు కల వచ్చెనట. ఆసంగతిని కోడలు జక్కులమ్మతో చెప్పగా ఆమె సంతోషముతో నంగీకరించి తలంటిపోసికొని పట్టు వస్త్రములు ధరించి ఏడువారాల సొమ్ములతో నలంకరించుకొని ఏడ తరాల అనగా ఏడు దొంతరల బోనాలనెత్తికొని జ్యోతి వెలిగించి మేళ తాళములతో మంగళహారతులు పట్టుకొని ముత్తైదువలు, ఊరుకు ఊరు వెంట కదలిరాగా శివమెత్తి చిందులు త్రొక్కుచు పోయినదట. నాటినుండి ఆ చెరువునకు జక్కుల చెరువను పేరు వచ్చినదట, నాటగోలె ఆ జక్కులమ్మ మావూరి అల్లాడివారి పాలిటి కన్యకాపరమేశ్వరియే యైనది. ఆకాలమునందే కోటలోపలివైపున ఏనుగ దిడ్డి ప్రక్కన నిర్మించిన జక్కులమ్మ గుడి ఈనాడు కనబడకుండ శిథిలమైపోయినది. దేవతయై నిలిచిన జక్కులమ్మ ఆనాటి నుండి కొంతకాలమువరకు అడిగిన వారికి అప్పుగా ధనమొసగెడిదని నగలిచ్చెడిదని నీళాలగాజులు లభించినవని ఇంకా యింకా అనేకానేకములగు కధలు, గాథలు ఇప్పటికిని జనులు చెప్పికొనుచుందురు. చెరువునిండి పంటలు పండిన ప్రతిసారి ఊరిపేర యీనాటికిని జక్కులమ్మను పూజించి నైవేద్యము పెట్టి వచ్చు నాచారము కలదు. జక్కుల చెరువు క్రింది పొలాలు పండిన తరువాత ఆమెకు మొక్కి కొబ్బరికాయనైనా కొట్టనిదే పొలము కోతపట్టరు. ఈ జక్కుల చెరువు రెండు గ్రామాలలోగల (700)ల ఎకరములకు పారును.

నూట అరవైయేండ్లకు పూర్వము భూమిపన్ను చెలక భూములకు బిగాను ఒక్క రూపాయ, నీరు పొలమునకు బిగాను అయిదు రూపాయలు (బిగమనగా ఇప్పటి హెకేరునకు సమానము. అనగా రెండున్నర ఎకరములు). అని వృషనామ సం. ర చైత్ర బ॥ ౧౦ గురువారమునకు సరియగు 25 రబ్బిలాల్ 1236 హిజిరీనాటి రాజబాయి సర్‌దేశాయి జమీదారు సర్కారు ఎలగందులగారు మావూరి అల్లాడి గంగప్ప మొదలగు వారలకు వ్రాయించి యిచ్చిన దిగువ మఖ్తాసనదు వలన తెలియుచున్నది.

### ఈనాటి లిపిలో సనదు పూర్తి పాఠము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ ప్రవర్తమాన వృషనామ సంవత్సర చైత్ర బ॥ ౧౦ గురువారంనాడు అల్లాడి గంగప్ప సీతారాముడు పాపడు [1] బకాలు [2] మ॥ బొప్పాపురంకు గారెంట్లరాజాబాయి సర్ దేశాయి జమీదారు [3] సర్కారు వెలగందుల వగైరా గారు వ్రాయించి యిచ్చిన [4] మఖ్తా [5] సనదు [6] సన్ 1230 [7] సాలు మ॥ [8] మజ్కూరుల మీరు [9] బునియాదినుంచి వున్నవాండ్లు కనుక మఖ్తాసనదు చేయించి యిప్పించవలెనని శ్రుతం

నేసి సంతళ వేము సమ్మతించి మజ్కూరీల నిబంధనచేసి వ్రాయించి యిచ్చిన [10] తప్సీల......

బి గా లు

5 ఫసల్ ఖరీపు తా॥ చెక

2 నీరు పొలం తాలూకు.

ఫసలు [11] ఆబిస్సాని తాలూకు జక్కుల చెరువు పారకం కొలంచెంక.

1. ఫసల్[12] తాబిస్సాని తాలూకు పూర్వం మీ[13] యీనాం బాబతు గుండ్లకుంట బిగెడు

2-7 బిగాలు ఆరువొక్కటి

(ఏడు అని ఉచ్చరించుట అమంగళమని భావించుట కిది తార్కాణము)

ఇందుకు [14] మొక్కరరు రూపాయలు

(ఇక్కడ తెలియుటలేదు)

5 చెంకబిగాలు 5 కొరకు

10 నీరుపొలం తాలూకు.

15 పదిహేను రూపాయలు.

ంగా చొప్పన మొక్కరరు చేయించినాము. [15] భాశరు జమతో గామంల ఊరి [16] సదరహి రూపాయలు సర్కారుకు [17] దాఖల్[18] సాలుబసాలచేస్తు మఖ్తా అనుభవిస్తు సుఖంగా వుండవలెను. మీ పుత్ర పౌత్ర పారం పర్యాయం వడిపిస్తున్నాము. యిది మా సమ్మతిని వ్రాయించి యిచ్చిన మఖ్తాసనదు [19] సహి [20] 25 [21] మాహె రబిలాల్ సన్ 1236 హిజిరి.

ద॥ రాజాబాయి సర్దేశాయి

జమీనాగలు సర్కారు

వెలగందుల వగైరా.

ఇందు చాలవరకు ఉర్దూపదము లున్నవి. వానికి తెలుగు స్వేచ్ఛానువాదము.

మా రాచెర్ల కోటలో కాన్పించు కట్టడము లన్నియు కాకతీయులనాటి శిల్పకళకు చెందియున్నవి ఇక్కడ లభించు ఇటుకలు, మట్టిపూసలు గాజులు కుండపెంకులు, గూవలు శిలలు శిల్ప ఖండికలు ఒకటేమిటి నేనినిచూచినా ప్రాచీన వైభవము ద్యోతకము కాగలదు మా పరిసరాలలోగల మువిరాయని (ఒక పిద్దుడట) ముండ్యాయని — చెరువు, కలికి చెరువు, కోమటికుంట, పోచమ్మకుంట, రుక్మాయికుంట, మంగలకుంట, మారేడుకుంట, గుండ్లకుంట, దేవతలబావి మొదలగు అనేక జలాశయములను వాని పేళ్ళను బట్టి ఆలోచించగా ఇదొక ప్రాచీన నగరమై యుండునని తోచుచున్నది. ఇందుకొన్ని పేరునకు మాత్రము మిగిలియుండగా కొన్ని యిప్పటికిని నిలిచియున్నవి. ఇవన్నియు మా కోట మరియు మా గ్రామపు పొలిమేరలవరకే పరిమితమైనట్టివి. మాకోటకు రెండు మూడు మైళ్ళ దూరమునగల గ్రామములలో ఇప్పటి గజ సింగారము ఉన్నచోట నొక గజశాల యుండెడిదని గజ శృంగారమే గజ సింగారమైనదని యందురు. ఇట్లె నాగంపేట, సింగారము, లింగాపురము, గొల్లపల్లె మొదలగు గ్రామాల సంబంధము పరిశీలింపదగి యున్నది.

ఇటీవలి కాలమున 10, 16 ఏండ్లకు పూర్వము నేను పటేండ్ల అగురములో అడుగున పడియున్న రెండడుగుల పొడవు నలువైపులా అడుగున్నర వెడల్పు గలిగి యున్నగా నల్లగా రెండు చివరలు విరిగిపోయి నడిమి భాగము మాత్రము మిగిలి మూడువైపులా చక్కని వ్రాతగల శిలాశాసనమునొకదానినిచూచి దానిని పైకి దొరలించుకొని తెచ్చియుంచితిని. ఆయేడు అగడ్త నిండా నీరు నిండుటవలన అది మరల లోపలికి జారిపోయినదనుకొంటిని. తరువాత కొంతకాలమునకు జూతునగదా అదియేమైనదీ యెక్కడున్నదీ జాడతెలియరాలేదు. ఉద్యోగవశమున మావూరు విడిచి తిరుగుచున్న నాకు అంతకన్నావీలు చిక్కలేదు. దానిని ఎవ్వరో శాసన పరిశోధకులు వచ్చి చూచి నకలు తీసికొని పోయినారని మాఊరి పెద్దలు చెప్పగా విన్నాను. పురాతత్వ శాఖవారు పూనుకొందురేని ఆ శాసన భాగములు ఇంకను కొన్ని శాసనములు చిక్కవచ్చును అనేకమగు నిధి నిక్షేపాలు లభించవచ్చును అన్నిటికన్నా ముఖ్యము అమూల్యమగు చారిత్రికాంశములు బయల్పడవచ్చును. ప్రస్తుతము ప్రాచీనావశేషములు నశించిపోకుండ తగు బందోబస్తు మాత్రమైనా చేయవలయును.

మా రాచెర్ల బొప్పాపురము భావి పరిశోధకులకు పట్టుగొమ్మయై పూర్వపు టౌన్నత్యమున ప్రకాశించుగాక!

[ఆకాశవాణి హైదరాబాదువారి సౌజన్యంతో]

| | |
|---|---|
| 1. వైశ్యలు | 2 గ్రామం |
| 3. ప్రభుత్వము | 4. జాగీరువంటిది |
| 5. సర్టిఫికెట్టు | 6. సంవత్సరము |
| 7. సంవత్సరము | 8. పేర్కొనబడిన |
| 9. మొదటనుంచి | 10. వివరము |
| 11. వానకాలపు | 12. వేసంగి |
| 13 ఇనామునకు సంబంధించిన | 14. నిర్ణయించిన |
| 15 విశ్వాసపాత్రులై | 16. పైన పేర్కొన్న |
| 17. చెల్లింపు | 18. వతిసంవత్సరము |
| 19 నిజము సత్యము (ప్రమాణార్థకము) | |
| 20. దివి; తేది | 21. నెల |

# మనవి

## శ్రీ విహారి & శాలివాహన

ఆకాశమంత దురదృష్టానికి
మాసికలు వేయమని కోరడంలేదునేను,

ఇల్లూ – వాకిలీ
తెల్లారే సరికల్లా
ఇంద్ర భవనంగా
పరిమళించిపోవాలని ఆశించటంలేదునేను.

ఆరు ఋతువులూ ఒకేసారి వచ్చి
తబ్బిబ్బు చేయాలని వాంఛించటంలేదునేను,

బంగారపు కంచంలో
పరమాన్నం వడ్డించి
నేతిబొట్టు
అభికరించమని "అథారిటీ" చేయటంలేదు నేను,

నా అణువణువును
పులుకు పులుకున చూసి పరీక్షించవద్దు,
నా నరాల్లో ఉష్ణశక్తిని ఉద్రేకపరచవద్దు,
నా కన్నీళ్లతో జేహారం సాగించవద్దు.

నాలో ఆశలు రేపకండి
నాతో బాసలు చేయకండి
నా గురించి ఆలోచించకండి
నన్ను వాడుకుని సాహిత్యం పెంచకండి
నా బతుకు నన్ను బతకనివ్వండి
నా దారి నన్ను వెతుక్కోనివ్వండి –

అంతగా ఉపకారచింత–మిమ్మల్ని
ఆగనీయకుంటే
అంబలి పోసేముందు
అడగండి ఉప్పు గల్లు !
అదే నాకు పదివేలు,
ఆ ఆనందం నాకే చెల్లు !

# జనాభా సమస్య ఆహార సమస్యా?!

డా. బి. ఆర్. కె. రావు

(గత సంచిక తరువాయి)

ప్రపంచ ఆహార స్థితి క్లిష్టదశలో వున్నదని చెప్పినపుడు, రైతు వ్యవసాయంలో హెచ్చుగా కృషిచేయడానికి కావలసిన ప్రోత్సాహాలు ప్రపంచంలో చాలా పెద్దభాగాల్లో బలహీనంగా ఉన్నవనే విషయం మర్చిపోతున్నారు పరిమితావసరాలున్నచోట విశ్రాంతిని హెచ్చుగా కోరుతున్నారు మనందరకు బాగా తెలిసిన సంస్థాగత కారకాలి సందర్భంలో చాల ముఖ్యము. ఈ సంస్థాగత కారకాలుగా భూస్వామ్య పద్ధతుల (land tenure) ఏర్పాట్లను, రవాణా సౌకర్యాల లోపాన్ని, లోపభూయిష్టమైన విపణివిధి వ్యవస్థను, ధరల నియంత్రణ ద్వారా ఆహార ధరలను అదుపులోవుంచడానికి చేసే ప్రయత్నాలను పేర్కొనవచ్చు. శ్రమచేసి పనిచేయడానికి హెచ్చు శ్రమచేసి కృషి చేయడానికి యింకా బాగా అవకాశాలున్నవి. ఈ అవకాశాల్ని సద్వినియోగం చేసుకోవలసి ఉన్నది. వ్యవసాయాభివృద్ధిని పురోగమింపచేయడానికిది చాల ముఖ్యము.

ఇతర ఉత్పాదకాల (inputs) లో రసాయనిక ఎరువు ముఖ్యమైనది. రాలుబడిని పెంచే యితర మార్గాలున్నయ్యి కాని, చెప్పదగ్గ రాలుబడి పెరుగుదల తగినంత రసాయనిక ఎరువు వేయకుండా లభ్యంకాదు. రసాయనిక ఎరువు వేయడంవల్ల వచ్చే ప్రతిఫలాలు భూస్థితినిబట్టి, కాలాన్నిబటి, విత్తనాలనుబట్టి మారుతూ వుంటాయి కాని మామూలుగా ఒక కిలోగ్రాము రసాయనిక ఎరువు వేస్తే, పరిస్థితులు అనుకూలంగా వున్నప్పుడు, అదనంగా పదికిలోగ్రాముల రాలుబడి వస్తుందనే ఒక మొద్దు సూత్రం ఉన్నది.

అల్పాభివృద్ధి దేశాల్లో రసాయనిక ఎరువులు తగినట్లుగా లభ్యం కాకపోవడంవల్లనే తక్కువ మాత్రలో వేయడము, నగదు పంటలకు, ఆహారేతర పంటలకు మాత్రమే వేయడము జరుగుతోంది. రసాయనిక ఎరువుల్ని ప్రవేశపెట్టినపుడు, వానివల్ల లాభాలు ప్రదర్శింపబడేవరకు, రసాయనిక ఎరువుల సామర్థ్యాన్ని గురించి అనుమానాలు వస్తున్నవి. పాకీస్తాన్‌లోవలె సబ్సిడీలు యిస్తే మినహా, అల్పాభివృద్ధి దేశాల్లో రసాయనిక ఎరువుల ధరలు హెచ్చుగా వుంటాయి అయితే ఈజిప్టు, తైవాన్‌లను ఉదాహరణగా తీసుకున్నట్లయితే, రసాయనిక ఎరువులను ఉపయోగించేందుకు నిరుత్సాహంకలుగరాదు. తైవాన్‌లో వెలతీసుకోకుండా రసాయనిక ఎరువుల్నిదంచి పెట్టడంవల్ల వాటిని వాడేందుకు ప్రోత్సాహం లభించింది. పోతే ధాన్యం ధరలు తక్కువగా వున్నందున, రసాయనిక ఎరువుల ధరలకు, ధాన్యం ధరలకు మధ్య పెద్ద వ్యత్యాసం కన్పించి రసాయనిక రసాయనిక ఎరువుల్ని వాడేందుకు నిరుత్సాహం కల్గుతోంది.

వ్యవసాయ సంఘటన వ్యవస్థ తగినట్లుగావున్న చాలచోట్ల పంటలో మెరుగుదల రావడానికి చాల అవకాశం ఉన్నది. వ్యవసాయ నిపుణులు రవాణా, విపణివిధి సౌకర్యాలు, వ్యవసాయ పరపతి, ధాన్యం నిలువజేసే వసుపాయాలు, అక్షరాస్యతలలో పెద్దగా మెరుగు రావాలని గట్టిగా చెబుతున్నారు. కాని అనుభవాలన్నీ, వ్యవసాయిక పురోగమనం జరగడానికి వ్యవసాయరంగంలో మౌలిక, అనువర్తిత పరిశోధనలలో పెద్ద ఎత్తున ప్రభుత్వ ప్రయత్నము, వ్యవసాయకులకు తత్సంబంధమైన విజ్ఞానాన్ని అందజేయడానికి విస్తరణ సేవలు (Extension services) కావాలని తెలియజేస్తున్నాయి. కాని అల్పాభివృద్ధి దేశాలలో జరిగే పరిశోధన ఆ దేశాల పరిస్థితుల కనుగుణ్యమైన రకాలను, పద్ధతులను తయారు చేయడంలో పెద్దగా సాధించిందేమీలేదు. 1950-1960 కాలవ్యవధిలో కొత్తరకం గోధుమ విత్తనాలు రాలుబళ్లను రెట్టింపునకు పెంచినవి. పరిశోధనవల్ల ఇజ్రాయెల్‌లో నీటి పారుదల సౌకర్యంలేని భూమిమీద తృణధాన్యాల (Cereals) రాలుబడి హెక్టారుకు 600 కిలోగ్రాముల నుండి 5000 కిలోగ్రాములవరకు పెరగగా, నీటిపారుదల సౌకర్యంగల భూమిలో హెక్టారుకు 3,000నుండి 10,000 కిలోగ్రాముల వరకు రాలుబడి పెరిగింది. కనుక పంటరాలుబడి పెరగడానికి చాలా అవకాశాలున్నవి. అయితే యిందు కవసరమైన పరిశోధనకు మాత్రం అల్పాభివృద్ధి దేశాల్లో విత్త వనరులు బహుతక్కువగా ఉన్నవి. ఇప్పటికీ యీ పరిశోధనా నిర్వహణకు అంతర్జాతీయ సహాయం అందింది,

అయినా యీ సహాయాన్ని యింకా చాలవరకు, హెచ్చింపజేయడానికి అవకాశాలున్నాయి కాబట్టి, వాటిని వివేకంతో ఉపయోగించుకోవాలి.

## ఆహార సరఫరా ప్రవృత్తులు

అల్పాభివృద్ధి దేశాల్లో ఆహార సంకటం వస్తుందని మామూలుగా నమ్ముతున్నప్పటికీ, ఆ దేశాల్లో గత సంవత్సరాల వ్యవసాయ ఫలితాలకు సంబంధించిన గణాంకాలను పరిశీలించినట్లయితే అటువంటి ప్రవృత్తి కన్పించడంలేదు అల్పాభివృద్ధి దేశాల ఆహారోత్పాదనకు సంబంధించిన గణాంకాలు సరైనవికావు, ముఖ్యంగా మానవ పోషణకు సంబంధించిన ఆహారోత్పాదన గణాంకాలు సరైనవికావు. అయినప్పటికి జనాభా పెరుగుదలకు సంబంధించిన గణాంకాలతో అవి కూడా సమానంగా ముందుకొచ్చినవి. అయితే జనాభా పెరుగుదలకు సంబంధించిన గణాంకాలు కూడా సరిగాలేవు. అల్పాభివృద్ధి దేశాల తలసరి ఆహార సరఫరా నిశ్చలంగా ఉన్నది. అయితే 1960–1970 కాల వ్యవధిలో తలసరి ఆహార సరఫరా తగ్గింది. ఇందులో 1965–1966లో సన్నిహిత ప్రాచ్యంలో మినహా, మిగతా అల్పాభివృద్ధి దేశాలన్నింటా కూడా, అనుకూలంకాని వాతావరణంవల్ల తలసరి ఆహార సరఫరా బాగా తగ్గింది.

ఆహార వ్యవసాయ సంస్థ అంచనాల ప్రకారము తలసరి ఆహార సరఫరా (F A O, The State of Food and Agriculture, 1964, P. 34) తగ్గుముఖం పట్టిందా అని ఆలోచన చేయబడుతోంది. కాని అటువంటి నిర్ణయము, యీ క్రింది కారణాలవల్ల అకాల నిర్ణయమౌతుంది.

1) 1960–70 కాలవ్యవధిలో కన్పించిన తలసరి ఆహార సరఫరా తగ్గుదలలు, ఊర్ధ్వముఖ ప్రవృత్తిలో మొదటిసారిగా కన్పించిన తిరోగమనము.

2) 1966కు ముందు సంవత్సరాలలో తలసరి ఆహార గణాంకాలకంటె జనాభా గణాంకాలు హెచ్చు ఖచ్చితంగా సమీకరించబడుతున్నవని గుర్తుంచుకోవలెను.

3) జనాభా పెరుగుదల వేగం కావడంవల్ల అనుపాతానుకూలం గానిరీతిలో హెచ్చుమంది శిశువులు పిల్లలు కన్పిస్తున్నారు. అయితే వీరి ఆహారావసరాలు తక్కువ. ఒక్కొక్క పిల్లవాడిని ఒకయూనిట్‌లో భాగంగా తీసుకున్నట్లయితే యింకా కొంత అనుకూల పరిస్థితి కన్పిస్తుంది. అంటే తలసరి ఆహార సరఫరా తగ్గుదల జనాభా పెరుగుదలవల్ల అని యింకా స్పష్టంగా తెలుస్తుంది.

4) ఇదే కారణంవల్ల మొత్తం జనాభా పెరిగినరేటులో పనిచేసే శక్తిగల శ్రామికుల సంఖ్య హెచ్చలేదు. అందుచేత ఆర్థిక ఉత్పత్తిచేసే జనాభా తలసరి ఆహార సరఫరా యింకా కొంచెం మెరుగా ఉంటుంది.

మిత్రరాజ్య సమితి అంచనాల ప్రకారము, అల్పాభివృద్ధి ప్రాంతాల జనాభా రుగుదల, యీ శతాబ్దమంతా కూడా పెరుగుతూనే ఉంటుంది. ఇప్పుడు స్త్రీల హెచ్చు సారవత్త్వం వున్నదని ప్రమేయం పెట్టుకున్నట్లయితే, యీ శతాబ్దం చివరలోనే ఆ సారవత్త్వం తగ్గడానికి ప్రారంభిస్తుంది. 1960కు 2000వ సంవత్సరానికి మధ్య సగటు సాలీనా జనాభావృద్ధి, అల్పాభివృద్ధి దేశాల్లో, 2.5 శాతం ఉంటుంది.

అయితే ఆహారోత్పత్తి ప్రవృత్తి ఎలావుండవచ్చు? నిజం చెప్పాలంటే ఆహారోత్పాదన ఆగమన సూచన (fore cast) చేయడం వీలుకానిపని. ముందు వాటినిబట్టి తర్వాతవాటిని అంచనాలు వెయ్యటం (Extrapolations) కూడా ఏక పక్ష నిర్ణయంగావుండి విలువనురాబట్టుకోలేవు 1960 తర్వాత అల్పాభివృద్ధిదేశాల మొత్తం ఆహారోత్పాదనలో వచ్చిన తిరోగమనం తెలుస్తూనే ఉన్నది. జనాభా వృద్ధితో యీ ఈ ఆహార తరుగుదలను కలిపితే ఆర్థిక మాంద్యము (stagnation) కన్పిస్తోంది. తలసరి ఆర్థిక సూచికలు తరిగిపోవడం కూడా జరిగింది. అయితే స్పష్టమైన ప్రవృత్తి ఏదీ కన్పించడం లేదు.

1950–1960 కాలవ్యవధిలో ఒక సంవత్సరంలో మాతము ఆహారోత్పాదన 2.5 శాతంకంటె హెచ్చుగా పెరిగింది ఇదే ప్రవృత్తి ముందు కూడా తప్పక కొనసాగితే, మిత్రరాజ్య సమితి అంచనాల ప్రకారము జనాభా పెరిగితే, తలసరి ఆహార సరఫరాస్థాయి యిదివరకటిలాగానే పడిపోకుండా, నిలచి వుంటుంది. అలాకాకుండా 1960లో జరిగినట్లు జరిగితే, పరిస్థితులు ప్రమాదకరంగా ఉండవచ్చు

అయితే ఆహారోత్పాదన జనాభా, శ్రామిక సంఖ్యలతో

సంబంధంలేకుండా పెరుగుతుందని నమ్మడం సహేతుకమేనా ? అల్పాభివృద్ధి దేశాల్లో అధికంగా శ్రామికులున్నారని, యితర ఉత్పాదన కారకాలకొరతే ఉత్పత్తి రాశిని యిప్పటివరకు నిర్ణయిస్తోందని విశ్వసించినట్లయితే జనాభాతోను, శ్రామిక సంఖ్యతోను సంబంధం లేకుండా ఆహారోత్పాదన పెరుగుతుందని చెప్పడం సబబే అవుతుంది కాని యితర ఉత్పాదన కారకాల కొరత ఆహారోత్పాదనను నిర్ణయిస్తోందని గట్టిగా చెప్పడం కష్టం. గత దశాబ్దాలలో జనాభా వేగంగా పెరుగుతూన్నదేశాలలోనే ఆహారంకూడా వేగంగా పెరిగింది. మొత్తం ఆహారోత్పాదన విషయంలోకంటె తలసరి ఆహారోత్పత్తి విషయంలోనే ఒకేరకమైన ప్రవృత్తి కన్పిస్తోంది. 1964 లో ప్రచురించిన 'ది స్టేట్ ఆఫ్ ఫుడ్ అండ్ అగ్రికల్చర్ (**The State of Food and Agriculture**) అనే గ్రంథంనుండి ఇరవైనాలుగు దేశాలకు సంబంధించిన ఆహారోత్పాదన గణాంకాలను తీసికొని పరిశీలించినట్లయితే, 1951–53 లోను 1962-63 లోను అన్ వెయిటెడ్ సగటు ఆహారోత్పాదన పెరుగుదలలు జనాభావేగంగా పెరుగుతున్న దేశాల్లోనే యితర దేశాల్లోవంటి హెచ్చుగావున్నట్లు కన్పిస్తుంది.

తలసరి ఆహారోత్పత్తి ప్రవృత్తిని చూడగల్గినట్లయితే, భవిష్యత్తులో రాబోయే ఆహారోత్పత్తికిది యితర నాటికంటె సరైన సూచన అని చెప్పడానికి వీలుంది. 1950 1960 మధ్య తలసరి ఆహారోత్పాదన తలసరి ఆహార వినియోగాల స్థాయిలో కొద్దిపాటి మెరుగుదల వచ్చింది. అందువల్ల తలసరి ఆదాయాలు పెరిగినవనే నమ్మకానికి పై పరిస్థితికి సరిపోయింది. బీదదేశాల్లో తలసరి ఆదాయాల్లో హెచ్చుభాగం ఆహారంమీద ఖర్చు చేయబడుతుందని సాధారణంగా నమ్ముతారు. ఆహార వ్యవసాయ సంస్థ గణాంక శాస్త్రజ్ఞులు తక్కువ ఆదాయదేశాల్లో ఆదాయానుసార ఆహారం గిరాకీ వ్యాకోచము (**income elasticity of Food Demand**) 0.8 గాను, ఆఫ్రికా, సన్నిహిత ప్రాచ్యాలలో 0.6 గాను, లాటిన్ అమెరికాలో 0.4 గాను వున్నదని చెబుతున్నారు. సగటు ఆదాయ ఆహార డిమాండ్ వ్యాకోచాన్ని అపరిష్కృత రీతిలో 0.7గా తీసుకుంటే తలసరి ఆదాయంలో జరిగే ప్రతిఒక శాతపు పెరుగుదలకూడా ఆహార డిమాండ్‌ను 0 7 శాతం మేరకు పెంచగలదు మొత్తం వాస్తవ జాతీయాదాయం (**GNP**) పెరుగుదల అంచనాల ప్రకారము పెరుగుతుందని ఆశించడానికి వీలున్న దానికంటె 1950-1960 లో కన్పించిన తలసరి ఆదాయ వినియోగపు పెరుగుదల చిన్నదిగా ఉన్నది. కుటుంబ ఆదాయాలు యింకా తక్కువగా పెరిగివుండవచ్చు. ఏమైనప్పటికి ఆహార వినియోగము, ఆదాయము ఏకోన్ముఖంగా పెరిగినవి అయితే అంతర్జాతీయ గణాంకాలు, యిందుకు విరుద్ధంగా, 1960–1970 కాలవ్యవధిలో తలసరి ఆదాయాలు పెరుగుతూనే వున్నప్పటికి తలసరి ఆహార వినియోగం తగ్గిందని సూచిస్తున్నవి. ఈ పరిస్థితుల్లో జరిగినదాని ప్రవృత్తిని, మొత్తం ఆహారోత్పత్తి అంకెల శ్రేణినుండి నిర్ణయించడంవలెనే తలసరి ఆదాయ, ఆహార వినియోగం అంకెల నుండి నిర్ణయించడం అర్థరహితంగా ఉంటుంది.

విశ్వాసంతో చెప్పదగిన విషయం రెండు ప్రతిపాదనలక్రింద విభజించవచ్చు.

(1) రానున్న యీ శతాబ్దపు మిగతాకాలంలో, యిప్పటి వరకు సాధించిన వ్యవసాయవృద్ధిరేట్లతో, ప్రస్తుత ఆహార వినియోగ స్థాయిలను పోషించవచ్చు.

(2) ప్రాముఖ్యతగల స్థాయివరకు ఆహార సరఫరాలో సాధారణ మెరుగుదలను తేవాలంటే, యింతవరకు చూచిన దానికంటె వ్యవసాయరంగం బాగా పనిచెయ్యాలి, అయితే అల్పాభివృద్ధి దేశాలు అవసరమైన వృద్ధిరేట్లను యిదివరకే సాధించడమేగాక ముందు కూడా అలా సాధించగల వచ్చు.

గణాంక సమాచారాన్ని సాక్ష్యాధారంగా తీసుకున్నట్లయితే, ఆహారోత్పాదన విషయంలో ఆశా, నిరాశావాదాల రెంటికి కూడా బలమైన ప్రాతిపదికలేదు.

## ఆహారంలో ప్రపంచ వ్యాపారము

వర్ధమానదేశాలు (**Developing Countries**) పెద్ద రాసుల్లో ఆహార పదార్థాల ఎగుమతి, దిగుమతులు చేస్తున్నవి అయితే ద్వితీయ యుద్ధానంతరం వర్ధమానదేశాల ఆహార ఎగుమతులకంటె ఆహార దిగుమతులు అధిక వేగంతో పెరిగినవి. రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు యిట్టి దేశాలన్నీ నికర ఆహార ఎగుమతిదార్లుగా ఉండేవి ఆసియామ మినహాయించి , ఆహార పదార్థాలన్నిటినీ గణన లోకి తీసుకున్నట్లైతే, 1967వరకు వర్ధమానదేశాలు నికర ఆహార

ఎగుమతిదార్లుగానే వున్నవి. ప్రపంచంలో ముఖ్య ఆహారంగావున్న తృణధాన్యాల విషయంలో, వర్ధమానదేశాల నికర ఎగుమతి వ్యాపారము జారిపోయింది; ప్రపంచంలోని ప్రధాన భాగాలన్నీ 1967 వరకు తృణధాన్యాలలో నికర దిగుమతిదార్లుగానే ఉన్నవి.

ఆహార ఎగుమతులు తరిగి, దిగుమతులు పెరుగుతున్న ప్రవృత్తి చూపినపుడు, వర్ధమాన దేశాలకు తమను తాము పోషించు శక్తి పోతోందని చెప్పాలని కొంతమంది ముందుకూగుతున్నారు ఇందువల్ల ఆహార కొరత, బడ్జెట్‌లోటు పెరుగుదల, బీదదేశాల వ్యవసాయ పురోగమనం తగినట్లు జరగకపోవడము, మాల్థస్ చెప్పిన జనాభా -ఆహార సంబంధ సంకట సంభావ్యత కన్పిస్తున్నట్లు అలా ముందుకూగేవారు సూచిస్తున్నారు

ఇటువంటి నిర్ణయాలు చేయడం తొందరపాటు కావచ్చు తాము చవుకగా ఉత్పత్తిచేసే వస్తువుల్ని ఎగుమతిచేసి అందుకు బదులుగా ఆహారాన్ని దిగుమతి చేసికోవడము అల్పాభివృద్ధి దేశాలకు అసహజంగాని, విపరీత ప్రవృత్తిగాని కాదు. యూరోపు తన ఆహారాన్ని తాను సరఫరా చేసుకోలేకపోవడము యూరోపునకు నష్టదాయకమని ఎవరూ చెప్పరు; కాని ఆహారాన్ని స్వయంగా సరఫరా చేసుకోలేకుండా తన ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవడానికి, యూరోపుకు ఎంత ఖర్చవుతోందనేదే ప్రశ్న సాంప్రదాయసిద్ధంగాను, పొరబాటుగాను వస్తున్న అభిప్రాయాలను వదలివేయడం మంచిది. ముఖ్యంగా పారిశ్రామిక దేశాలకు వర్ధమాన దేశాలకు మధ్య సహజ శ్రమవిభజనకు సంబంధించిన అభిప్రాయాలను వదులుకోవాలి ఫ్యాక్టరీ పరిశ్రమలోవలెనే వ్యవసాయంలో కూడా నైపుణ్యాలు మూలధనము, విదేశీ మారక ద్రవ్యము, అభివృద్ధి జరగడానికి అవసరమౌతాయి. ఈ వనరుల్లో దేనినెంత వరకు ఎక్కడ ఉపయోగించాలా అనే విషయం. ఇతర దేశాలనుండి దిగుమతి చేసుకోవడానికి అయ్యేఖర్చులతో పోల్చినపుడు దేశీయ ఆర్థిక కార్యక్రమాల్లో ఏది హెచ్చు ప్రతిఫలం ఇస్తుందా అనే దానిమీద ఆధారపడి వుంటుంది. అమెరికావంటి దేశాల్లో వ్యవసాయ విప్లవం అధికోత్పత్తి నిస్తున్నప్పుడు అల్పాభివృద్ధి దేశాలు దాన్నుపయోగించుకోవాలని కొంతమంది చెబుతున్నారు అయితే అమెరికావంటి దేశాలనుండి ఆహారం అందడాని కనువైన అంతర్జాతీయ పరిస్థితులు ఎప్పుడూ వుంటాయనే గ్యారంటీ ఏముందని, దేశ స్వాతంత్ర్యాని కిది విరుద్ధంకాదా అని ఇండియావంటి దేశాల్లో కొంతమంది గట్టిగా ప్రశ్నిస్తున్న విషయాన్ని ఎవరూ మర్చిపోకూడదు.

చాలకాలం అమెరికానుండి అల్పాభివృద్ధి దేశాలకు రాయితీ షరతులమీద ఆహార దిగుమతులు జరిగినవి. ఆర్థిక సహాయం లేక పోయినట్లయితే ఆహార దిగుమతులు అంత పెద్ద మొత్తంలో జరిగి వుండేవికావు

అయితే అల్పాభివృద్ధి దేశాల నికర దిగుమతిస్థితి మారినప్పటికీ దిగుమతులు, ముఖ్యంగా నికర దిగుమతులు పెరిగినప్పటికీ, మొత్తం ఆహార సరఫరాలతో పోల్చినపుడు, నికర దిగుమతులు కేవలం ఉపాంత (Marginal) స్వభావము గలవి మాత్రమే. అల్పాభివృద్ధి ప్రాంతాల ఆహార సరఫరాలో వారి నికర ఆహార దిగుమతులు కొద్దిశాతం మాత్రమే. ఈ శాతం లెక్కలే దిగుమతుల ప్రాముఖ్యాన్ని తెలియచెయ్యలేదు. ప్రత్యేక దేశాలకు ఆహార వ్యాపారము, ప్రతి ప్రాంతంలో కూడా, ఎక్కువ ముఖ్యంకావచ్చు కొన్ని సందర్భాల్లో విపణి వీధికి పంపిన ఆహారంకంటె, పట్టణాలకు పంపిన ఆహారంకంటె నికర ఆహార దిగుమతులు ఎక్కువ రాశిలో వుండవచ్చని ప్రపంచ ఆహార, వ్యవసాయ సంస్థ చెబుతోంది. అంతర్గత పంపిణీ, ధరల విధానము అనుకూలంగాక ఆహారోత్పాదనను పెంచడానికి, పట్టణ వినియోగ కేంద్రాలకు ఆహారాన్ని పంపడానికి ఆటంకమై ఆహార సమస్య ఏర్పడినప్పుడు, పట్టణాల్లోను, నగరాల్లోను వున్న ఆహార సరఫరా కొరతను తీర్చడానికి విదేశాలనుండి ఆహారాన్ని దిగుమతి చేసుకోవడము అవసరంగా జరుగుతూనే ఉంటుంది. వ్యవసాయోత్పాదకత ఉన్నతస్థాయిలో వున్నప్పుడు కూడా యిటువంటి సంకటాలు రావచ్చు. ఇలాటి సంకటాలు వచ్చినట్లయితే వాటిని పంపిణీ విధానం అపజయం పొందిన ఫలితంగా వచ్చినట్లు తీసుకోవాలేగాని, ఉత్పత్తి అపజయం పొందటం వల్ల వచ్చినట్లుగా పరిగణించరాదు.

## ప్రస్తుత అల్పపోషణ

ఈనాడు అల్పాభివృద్ధిదేశాల ప్రజలు సంతృప్తికరమైన ఆహార పోషణకు చాలాదూరంలో ఉన్నారు అధిక జనాభాయే అల్పపోషణకు కారణమని చెప్పడం కొంతవరకు తొందరపాటు కావచ్చు జనసాంద్రత తక్కువగావున్నచోట్లకూడా, పేదరికంవున్నట్లయితే, అల్ప పోషణ పేదరికానికి లక్షణంగా ఉన్నది. అల్ప పోషణ, భవిష్య

త్తులో ఆహార సరఫరాలు నిలాజరగాలో సూచిస్తోంది. ప్రస్తుత ఆహార లోపం సరిదిద్దబడాలంటే జనాభాకంటె వేగంగా ఆహారం పెరగాలి.

భోజనంలో కన్పించే 'కేలరీ లోపము' ఆకలికికొలత. దీన్నే అల్పపోషణ అని అంటారు. తక్కువ రాశిలో భోజనంతీసుకోవడం వల్ల కేలరీశక్తి తక్కువగా లభ్యమై శరీరము పెరగదు 1960లో ప్రపంచ ప్రజల్లో 10 నుండి 15 శాతం వరకు అల్ప పోషణలోనే ఉన్నారు అనగా 300 నుండి 500 మిలియన్ల ప్రజలు అల్ప పోషణలో వున్నారని అంచనావేయబడింది. 1960 నుండి 1975 వరకు అల్పపోషణలోనున్న జనాభాసంఖ్య యింకా బాగా పెరిగింది.

అల్పపోషణ ముఖ్యంగా ఆసియాలో కన్పిస్తోంది. ఇతర ప్రాంతాల్లోకూడా యిట్టి కొరత వున్నప్పటికీ, మరికొన్ని వస్తువులు అధికంగా సరఫరా కావడంవల్ల ఆ కొరత కన్పించడంలేదు. ప్రతి ప్రాంతంలోను, ప్రతిదేశంలోకూడా వ్యక్తులమధ్య జరుగుతున్న ఆహార పంపిణీలోపం వల్ల యిటువంటి అల్పపోషణస్థితి ఏర్పడుతోంది. ఆహార సరఫరాలకు సంబంధించిన "సగటుల" అంకెలు నమ్మడానికి వీలుకానివేగాక యథార్థమైన పరిస్థితిని తెలియజేయడానికి పనికిరావు.

అనుచిత పోషణ (malnutrition) మరొక లోటు. గుణ లోపంగల ఆహారము తగురాశిలోవున్నా అనుచిత పోషణ, అసంతులన పోషణ జరుగుతుంది. దీన్ని అంచనా వేయడం కష్టమైనా, అల్ప పోషణకంటె చాలహెచ్చు రెట్లలో ఉన్నది. ప్రపంచ ఆహార వ్యవసాయ సంస్థ అంచనా ప్రకారం ప్రపంచ జనాభాలో 40 శాతంమంది, అల్పాభివృద్ధి దేశాలజనాభాలో 60 శాతం మంది అనుచిత పోషణలో ఉన్నారు. భోజన గుణాలను గురించి నిపుణుల్లో సంపూర్ణమైన అంగీకారం లేదు. అయితే సబ్ క్లినికల్ మాల్‌న్యూట్రిషన్ (sub clinical malnutrition) ను గురించి ప్రత్యక్షంగా తెలుసు ఈ స్థితి ఆరోగ్యాన్ని చెడగొడుతుంది. మనిషికి జాగ్రత్త, శ్రద్ధ లేకుండా పోతాయి బాగుచేయడానికి వీలులేని విధంగా పిల్లల మానసిక శక్తిని పెరగకుండాచేస్తుంది. బీదదేశాల్లో మాంసకృత్తులు, ముఖ్యంగా పశువులనుండి వచ్చే మాంసకృత్తులు, చాలా కొరతగా ఉన్నవి బీద దేశాల్లో చాల ఖరీదైన ఆహారంలోనే మాంసకృత్తులు లభ్యమౌతున్నవి.

ప్రపంచ ఆహార వ్యవసాయసంస్థ, 1963లో, తన మూడవ ప్రపంచ ఆహార సర్వేలో పోషణ లోపాన్ని తొలగించడానికి సాధించవలసిన కొన్ని లక్ష్యాలను సమర్పించింది, ఆహారావసరాలలో మొత్తం మీద రావలసిన పెరుగుదలలను అంచనావేయడానికి, తీసుకోవలసిన కేలరీలలోని పెరుగుదలను, తీసుకోవలసిన 'జంతువుల' నుండి తీసిన ఆహారాన్ని, 1963 ధరల ప్రకారము, కలిపి మొత్తంచేసి చెప్పారు. స్వల్పకాలంలో, అనగా 1975 నాటికి, తక్కువ కేలరీలు తీసుకుంటున్న దేశాలలో, మొత్తం ఆహారంలో 27 శాతం పెరుగుదలను సిఫారసుచేసారు దీర్ఘ కాలంలో అనగా 2000వ సంవత్సరం నాటికి 57 శాతం పెరుగుదల కేలరీ ఆహారంలో రావాలన్నారు. భవిష్యత్ ఆహార సమస్యను చర్చించడానికి లక్ష్యాలు కుతూహలం కలిగిస్తాయి. అయితే యిప్పుడున్న ఆహారస్థాయికంటె వున్నతమైన స్థాయికి చెందినవిగా యీ లక్ష్యాలను తీసుకోవలసిఉన్నది. 0 7 శాతం ఆదాయ ఆహార డిమాండ్ వ్యాకోచంతో, 80 శాతం ప్రజల ఆదాయాల్లో పెరుగుదల వచ్చినట్లయితే, ఆహార వినియోగం ప్రపంచ ఆహార వ్యవసాయ సంస్థ నిపుణులు చెప్పిన స్థాయికి రావడానికి వీలున్నది.

## ముగింపు

అల్పాభివృద్ధిదేశాల జనాభా త్వరిత పెరుగుదల భయాందోళనలు కలుగజేయడానికి తగినంత కారణం ఉన్నది. అయితే జనాభా సమస్యల చర్చలలో ప్రముఖంగా కన్పిస్తున్న 'నిరాశావాదం' అన్నివిధాల జాగ్రత్త తీసుకు చెప్పినట్లయితేనే తగినదిగా ఎంచబడుతుంది. పేద దేశాల పోషణ స్థాయిలు పేదవిగానేఉన్నవి. ఎప్పుడూ తక్కువగా వున్నట్లే యిప్పుడూ తక్కువగానే ఉన్నవి. అనుచిత పోషణను గురించి బాగా తెలిసిన ఒక ఆహార పోషణ శాస్త్రజ్ఞుడు యిలా నొక్కి చెప్పాడు : "మానవజాతి అనుభవించే చాలా పోషణ సంబంధమైన పీడలు, చరిత్రను పరిశీలించినట్లయితే, పోషణ పదార్థాల కొరతవల్లకంటె, అజ్ఞానంవల్ల, బాధలకు అలవాటుపడిపోయి నొప్పిలేకుండా వుండడంవల్ల కలుగుతున్నవి. రక్షించడానికి కావలసిన మాంసకృత్తులు లభ్యమయ్యేచోట్లనె వేలమంది పిల్లలు మాంసకృత్తుల లోపంవల్ల చనిపోతున్నారు. శిశువులు, ఊగులాడుతూ నడిచే పిల్లలు మాంసకృత్తుల లోపంవల్ల చనిపోయే కుటుంబాలలోనే మాంసకృత్తులు తగిన మాత్రలో వినియోగించబడుతూనే ఉన్నవి". అనగా పెద్దలు వినియోగిస్తున్నప్పటికి, అజ్ఞానంవల్ల, పిల్లలకు తగినన్ని మాంసకృత్తులను ఆహారంలో యివ్వడం లేదని దీని భావము.

వర్తమాన దేశాల వ్యవసాయ ఉత్పాదకత తక్కువగా ఉన్నది. అయితే జనాభా సాంద్రత పెరిగిన కొలదీ శ్రామిక సాంద్రతను పెంచే అవకాశాలు గతంలో కన్పించినవి. ఆ అవకాశాలు మరకుండా

అలాగే ఉన్నవి. చాలాచోట్ల సేద్యం చేయటానికి పనికివచ్చే భూమి నిల్వలో ఉన్నది. తక్కువరాలుబడి, హెచ్చు వృధా జరుగుతున్నందు వల్ల మెరుగుదలచేసే శక్తి విస్తారంగా ఉన్నది. ఆహారోత్పాదనలో స్వయం నిర్భరత అన్ని దేశాలకు అవసరంగాని, వాంఛనీయముగాని కాదనే అభిప్రాయం కొంతమంది కున్నది. అయినా వీలైనంతవరకు స్వయం నిర్భరతను ఆహార రంగంలో సంపాదించడము, రాజకీయ, ఆర్థిక, సాంఘిక శ్రేయస్సుకు దేశంయొక్క అంతర్జాతీయ గౌరవ ప్రతిపత్తికి మంచిది.

ఆహార పరిస్థితిని సర్దుబాటు చేసుకోవడానికి తగినంత దీర్ఘ కాలాన్ని అనుమతించినట్లయితే, ఆహారోత్పాదనను తగినంతగా పెంచ వీలవుతుందా అనేది తక్షణ సమస్యకాదు; ఆహారోత్పాదన వేగంగా పెంచబడుతుందా అనేది మన ముఖ్యసమస్య. గత ఉత్పాదన ప్రవత్తి ననుసరించే భవిష్యత్తులో ఆహార సరఫరా వృద్ధి జరుగుతుందని కొన్ని సార్లు అనుకున్నారు; అయితే ఆహారానికి డిమాండ్ మాత్రము వెగ త్వరణగల రేటుతో పెరుగుతుంది. అయితే యీ విషయంలో సర ఫరాశక్తి డిమాండ్ శక్తినుండి వేరుచేయబడజాలదు. ఇంతవరకు జనాభావృద్ధితో సంబంధంవల పోషణ పరిస్థితుల అధోముఖ ప్రవృత్తి వున్నదని నమ్మడానికి బలమైన ఆధారం అంతగాలేదు. తలసరి ఆహారోత్పత్తి, తలసరి ఆహార వినియోగము నిశ్చలంగా ఉండిపోయినవి. ఆహారోత్పత్తికి జనాభావృద్ధికి సహసంబంధము చెప్పబడింది నేటి జనాభా ప్రేలుడు **(Population Explotion)** వల్ల రావడానికి వీలున్న ఫలితాలలో వినాశకరమైన ఆహార కొరత అతిదూరంలోవున్న ఘటన మాత్రమే అల్పాభివృద్ధి దేశాల ఆర్థికాభివృద్ధి స్థాయిలో గమనార్హంగా పైకి లేవనంతవరకు, అప్పుడప్పుడు ఆహార సంకటాలు రావడము సంభవమే రవాణా సౌకర్యాలు హెచ్చు అసంతృప్తికరంగా వున్న గత రోజుల్లో ఆహార సంకటాలు యింకా తరచుగా వస్తూ వుండేవి.

అయితే జనాభా వృద్ధిరేటు హెచ్చుగా వున్నందువల్ల, ఆహార వినియోగ పరిస్థితుల్లోను, సాధారణ ఆర్థిక పరిస్థితుల్లోను గమనార్హమైన మెరుగుదల లేవడం చాలా వీలుగాని విషయంగా చెయ్యబడింది. ఈ దృష్టితో చూచినట్లయితే, ప్రాథమికంగా, జనాభా సమస్య ఆహార సమస్యకాదు; సాధారణ అభివృద్ధి సమస్య అవుతుంది. వర్ధమాన దేశాల ప్రస్తుత ఆదాయ స్థాయిలను దృష్టిలో వుంచుకుంటే, ఆహారంపై జరిగే ఖర్చు అన్ని ఖర్చుల్లోకి ఆధిక్యత గలదైనప్పటికి, మొత్తం ఆర్థిక సాంఘికాభివృద్ధి భవిష్యదవకాశం ప్రమాదంలో వున్నపుడు జనాభా వృద్ధి ఆర్థిక ప్రాముఖ్యతకు అహారంతో ప్రత్యేక సంబంధమున్నదని చెప్పడంవల్ల ప్రయోజనంలేదు.

అత్యయిక పరిస్థితులు సంభవించినపుడు, వర్తమాన భవిష్యత్తుల్లో ఆహార సమస్యకు ఉపశమనం కల్గించరాదని చెప్పనే చెప్పడంలేదు. స్వల్పకాలంలో, ఉపస్థితమైన పూర్ణ వనరుల పునః కేటాయింపు జరిగినా ప్రయోజనం లేనపుడు ఆహార సహాయం అంది తీరవలసిందే, తద్వారా ఉపశమనం కలుగవలసిందే.

అయితే దీర్ఘకాలంలో ప్రస్తుత పోషణ స్థాయిలలో అల్పాభివృద్ధిదేశాల ప్రజలను పోషించలేమనే భయం నిజంకానేరదు అయితే అత్యధిక జనాభావృద్ధివల్ల అంతర్జాతీయ అసమానత్వాలను తగ్గించివేసే అవకాశము సఫలీకృతం కానందువల్ల ఏర్పడే సమస్య ఆహార సమస్యతో సమానమైన బలము, ప్రభావముగల సమస్యగా తయారౌతుంది కాబట్టి దాన్ని ఎదుర్కొని పరిష్కరించడమే కష్టమౌతుంది.

*[అయిపోయినది]*

---

## ఆ ధా రా లు


1. Harrison Brown, Challange of Man's Future, New York, 1956.
2. K. M. Malin, Food Resources on the Earth.
3. F A O, Possibilities of Increasing World Food prodnction, Rnme, 1963.
4. Easter Boserup, The Conditions of Agriculjural Growth, London. 1965.
5. Lester R. Brown, Man, Land and Food, Washington, 1963.
6. Increasing World Food Out-put, Foreign Agri cultural Economic Report No. 25, Washington, 1965,
7. Lester R. Brown, Increasing World Out-put.
8. Changes in Agriculture in 26 Developing Nations, 1948 – 196?, Foreign Agricultural Economic Report No. 27, U. S. Department of Agriculture, Washington, 1965.
9. V. S. Panse and V, N. Amble, The Future of India's Population and Food Supply.
10. Jacob Viner, Some Reflections on the Concept of Disguised Unemployment, Indian Journal of Agricultural Economics, July 1957.
11, Theodore W. Schultz, Transforming Treditional Agriculture, New Heaven, 1964.
12, Mostan Poglin, Surplus Agricultural Labour and Development, Facts and Theories, American Economic Review, Sept. 1965.
15, F A O, The State of Food and Agriculture. Rome, 1964.
14. C. H, Farmsworth, Detects, Uses and Abuses of National Food Supply and Consumption Data.
15. Jean Mayer, Food and Population The Wrong Problem, Daedalus, Summer 1964
16. Mogens Bosesup, The Economic Problem of the Demographic Explosion.

# జీ వ న మ ధు రి మ

శ్రీ జి. వి. సు బ్బా రా వు

సర్వర్తు భావనా సమైక్యమై,
వేదనా తీత భావ సమున్ముక్తమై,
ఉద్వేల కవితా స్రవంతీ
చలత్తరంగ తేజో విరాజ మానమై
అపూర్వానంద ఘంటికా
ఘలం ఘల రవానుసంధానమై,
వెలసిన.
ఒక అనిర్వచనీయ
భావనా వాసంత పికీ గళగీతం
ఈ జీవన సంగీతం !
ఇది, —
విది పన్నిన ఉరులూకాదు,
మదినల్లుకొన్న చదరంగమూ కాదు.
ఆటు పోటుల చలించే జీవన వార్నిధి ;
సుఖ దుఃఖాల జ్వలించే మానవాంభోనిధి
కన్నీళ్ళూ, కంటకాలూ,
పన్నీరూ, పూలపాన్పూ,
వియోగం, విప్రలంభం
హాసం, సుధామధుర దరహాసం,
అన్నీ, మేళవించిన,
ఒక అపూర్వాను భూతుల రసాయన సమ్మేళనం !
ఒకానొక విషాద భావనా మధుర సంయోగం !
ఒక అనన్య బాధామోద చిత్ర విచిత్ర సంపర్కం !
నిరంతరంగా, నిర్విరామంగా,

యుగాలుగా, కల్పాలుగా,
అనంత కాలవాహిని గత బుద్బుదంగా,
సితాసిత భావనా జ్యోత్స్నా తరంగవిచలితంగా,
సాగిపోయె,
సంస్కృతిపథం
ఈ జీవనపథం!
ఊగిపోయె
జాగృతి పథం
ఈ జీవిత మనోరథం!
బాధావల్లకీగాథా మధుర నిక్వాణం
ఈ జీవిత కథనం!
ఆనంద నందీ నినాద ఝరీతరంగ సంచలనం
ఈ జీవన మధురిమ!! —



# రక్తయజ్ఞం

## శ్రీ కలువకొలను సదానంద

(గతసంచిక తరువాయి)

అర్ధరాత్రి అయింది. మనుషులరద్దీ ఎక్కువై పోతోంది. జనంలో నలిగిపోతూ, గుంపు ఏవైపుకు నెట్టితే ఆవైపుకు నడుస్తున్నాడు సుందరం. ఎంతసేపు చూచినా ఆ జనాలే! ఆ దుకాణాలే! ఆ సందడిలో ఆడా మగా తేడా లేకుండా ఒకరినొకరు రాసుకుంటూ ముందుకు పోతున్నారు.

సుందరానికి విసుగువేసింది. అతడు ఒంటరిగా మిగిలి పోయాడు. ఏమిటో ఈ తిరణాల! ఎందుకు రావాలితాను? ... అతని ఉత్సాహం పూర్తిగా చచ్చిపోయింది.

సుందరం టీ తాగాడు.

చలివేస్తూవుంది. కళ్ళు నిద్రతో బరువెక్కుతున్నాయి. ఈ చలిని నిద్రను జయించాలి. అతడు అరచేతులు రుద్దుకుని ఒళ్ళు వెచ్చజేసుకున్నాడు. చేతిరుమాలుతో కళ్ళు నులుముకున్నాడు.

శివరాత్రినాడు జాగారంచేస్తే పుణ్యం వస్తుందంటారు

నిద్ర చాలా సుఖప్రదమైనది. అలాంటి నిద్రను త్యాగం చేయడం నిజంగా గొప్పపనే! నిద్రకాయడం నిజమైన ప్రేమకు, భక్తికి తార్కాణం!...నిద్రమేలుకున్న వాడల్లా భక్తుడేనా? తేలు కుట్టితే రాత్రంతా నిద్రపట్టదు. వాడుకూడా భక్తుడేనా? భర్త జబ్బుపడితే, భార్య రాత్రంతా మేలుకుని అతనికి సేవచేస్తుంది. ఆమె గొప్ప భక్తురాలు! భార్య ప్రసవవేదన పడుతుంటే, భర్తకు నిద్రపట్టదు. అతడు గొప్ప భక్తుడు!

ఇందరు జనాలు నిద్రకు దూరమై ఇక్కడ పడయాడు తున్నారు. వీళ్ళలో చాలమంది నిద్రపోకుండా వుండగలుగుతున్నందుకు కారణమేమిటి? చెబిత తప్పలేదు. మన కావ్యాల్లోనూ భక్తికీ శృంగారానికీ సమాన గౌరవంవుంది. నిజం చెప్పాలంటే భక్తి తల్లి లాంటిది. చల్లగా జోకొట్టి నిద్రపుచ్చుతుంది. శృంగారం ప్రేయసి లాంటిది. నిద్రపోతున్నవాణ్ణి వెచ్చగా తట్టిలేపుతుంది.

మనిషికి నిద్రకంటె ప్రియమైనది ఏది? శృంగారమేకదా! శృంగారం వున్నచోట నిద్ర వుండదు. శృంగారం శాంతించి పడగ దించితేనే తప్ప నిద్ర గదిలోపలికి అడుగు పెట్టజాలదు.

ఆడవాళ్ళు, మగవాళ్ళు నిద్రను విదిలించి పారేస్తూ విహరిస్తు న్నారు. దొంగ నవ్వులు! దొంగచూపులు! దొంగచాటు సరసాలు!

సుందరం నడుస్తున్నాడు. తంబుర శ్రుతి, గుమ్మెత్త దరువు వినిపించాయి. అతడు ఆ మూలకు నడిచాడు. అక్కడ ఓ ముగ్గురు మనుషులు బుర్రకథ చెబుతున్నారు. వారి చుట్టూ జనం కూర్చుని వింటున్నారు సుందరం ఒక ప్రక్కగా నిలబడి కొంతసేపు కథ విన్నాడు. అతని ప్రక్కన ఎవరో దగ్గారు. అతడు తిరిగి చూశాడు. గౌరి ఠీవిగా నిలబడి అతనివైపు చూస్తోంది. ఆచూపుల్లో కొంచె మైనా కదలిక లేదు. 'చూపులు—నువ్వు మరల్చుకుంటావో, నేను మరల్చుకుంటానో చూద్దాంకానీ' అన్నట్లు — పందెం వేసినట్లుగా చూస్తూవుంది. సుందరం కళ్ళలో సూదులు పొడుచుకున్నట్లై కళ్ళు విలవిలలాడాయి. అతని చూపులు క్రిందికివాలి, మళ్ళీ బుర్ర కథ వాళ్ళమీద నిలిచాయి.

సుందరం మరోక్షణం మాత్రమే అక్కడ నిలబడి, వెనక్కి నడిచాడు. ఓచోట కొయ్యగుర్రాలు ఆడుతున్నాయి. జనం ఎగబడి ఆ ఆట చూస్తున్నారు. ఓ ఐదు నిమిషాలసేపు ఆడి, గుర్రాలు ముందుకు కదిలాయి. ఆ గుర్రాలవెంట నడవడానికి — జనం ఒక ర్నొకరు తోసుకున్నారు. ఆ ఊపులో ఓ అమ్మాయి విసురుగా పడి

పోతూ, సుందరంమీదికి వాలింది. అతడు తటాలున ఆమెను పడిపోనివ్వకుండా పట్టుకున్నాడు. ఆమె అతన్ని విదిలించుకుంటూ దూరంగా జరిగింది. ఆమె గౌరి అని అతని కంతవరకు తెలియలేదు. పెదాలు బిగించి, గౌరి అతనివైపు చురచురా చూసింది.

సుందరం జనాన్ని నెట్టుకుంటూ గబగబా దూరంగా వెళ్ళిపోయాడు. గుడిదగ్గర ఆగాడు. వెనక్కుతిరిగి చూశాడు గౌరికనిపించలేదు అతను తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

'ఆమె గౌరి అని నాకేం తెలుసు?...అసలు ఎవరయితే మాత్రమేం' పడిపోతూవుంటే చివాలున పట్టుకున్నాను. బాకులు విసురుతున్నట్టు అలా చూస్తుందేం?.. ఛీఛీ! ఈ గౌరి లేకపోతే తిరనాల ఎంతో బాగుండేది!...పోరుజారి ఒకమాట అన్నందుకే దేహశుద్ధి చేయించింది. ఇక ముట్టుకుంటే, నెత్తురు కళ్ళజూడదూ?... ఆ నాగరాజు పరమనీచుడు! మీ అమ్మాయేవచ్చి నామీద పడిందండీ అంటే వింటాడా?...నువ్వు లాక్కుపోతే ఎందుకొచ్చి పడుతుందిరా జులాయి వెధవా-అంటాడు. పిచ్చి కుక్కను కొట్టినట్టు కొడతాడు. వాడు కొట్టగలడు. కొట్టించగలడు నాకు కండబలం లేదు. మరెందుకో కొట్టలేను కొట్టడానికి డబ్బిచ్చి కూలివాణ్ణి కుదుర్చుకోవడం కూడా నాకు తెలియదు. జాగర్తరా సుందరం! నీ ప్రథమ శత్రువు సైతాను-గౌరిరూపంలో తిరణాలలో తిరుగుతున్నాడు!'

బిడ్డలులేని ఆడవాళ్ళు కొందరు చన్నీళ్ళలో మునిగివచ్చి గుడిముందర వరుసగా బోరగిల పడుకున్నారు భక్తులు వాళ్ళను దాటుకుంటూ వెడుతున్నారు అలా దాటితే పిల్లలు పుడతారని నమ్మకం కద్దు

సుందరానికి ఆ నమ్మకం చిత్రంగా కనిపించింది.

'పాపం! ఏడుస్తూ పుట్టి, ఏడుస్తూ బతికి, ఏడుస్తూ వెళ్ళిపోయే బిడ్డ తనకూ ఒకటి కావాలని అలా పడుకున్నారు. ఎందుకంత ఆరాటం వాళ్ళకు? ఆడవాళ్ళు గనుకనా? ఔనౌను! ఆడవారి సంపదల్లో గణనీయమైంది మాతృత్వం. తల్లి కాలేని స్త్రీ-నేను గొడ్రాల్ని అనుకుని తనలో తానే కుమిలిపోతుంది. ఆ గొడ్రాలితనం పోగొట్టుకోవాలన్న కోరికతోనే కదా, వాళ్ళు అలా పడుతున్నారు! చన్నీళ్ళలో మునిగి, ఒంటికి అంటుకుపోయిన బట్టలతో గజగజలాడిపోతూ పడుకున్నారు. భర్తముందు అలా కనిపించడానికి సిగ్గుపడే ఆడదికూడా బిడ్డ పుడుతుందనే ఆశతో యిక్కడ యిలా పడుకొంది. అయ్యో పాపం! లోకంలో ఎన్ని రకాల విషాదాలున్నాయి! పెళ్ళికాకముందే గర్భం ధరించి. దిగులుపడిపోయే వాళ్ళు కొందరు; పెళ్ళయి పన్నెండేళ్ళయినా-కడుపున ఒక్క కాయ కాలేదే అని కుంగిపోయే వాళ్ళు కొందరు! తల్లులకు నిందతేబోతున్నారనే నిరసనవల్ల కడుపుల్లోనే కరిగిపోయే ఆ పిల్లలు వీళ్ళ కడుపుల్లో పుట్టరాదూ?...ఆశ చెడ్డది! గుడ్డిది! అది ఏ మాటనైనా నమ్మమంటుంది. భక్తులు తమను కాళ్ళతో తొక్కి వెళ్ళినంత మాత్రానికే బిడ్డలు పుట్టిపోతారా? ఏ సూర్యుణ్ణో, దేవేంద్రుణ్ణో ప్రార్థిస్తే చక్కావచ్చి బిడ్డను చేతికిచ్చి పోవటానికిదేమన్నా పురాణకాలమా?.. బిడ్డ ఎలా పుడుతుంది?.. సుందరం ఆలోచనలు చీకట్లోకి వెళ్ళి తలుపులు మూసుకున్నాయి.

అతనికి సిగ్గువేసింది.

కంటిపాపల్ని కాల్చివేసేంత తేజోవంతమూ, దుర్నిరీక్ష్యమూ, తాపకారణమూ అయిన అగ్ని ప్రాణికి జీవనాధారం కావడం ఎంత చిత్రమైన విషయం!...కామం అలాంటిదే! ఎర్రగా కాలిన ఇనుపగోళంలాంటి కామంలోంచి ప్రాణం పుడుతోంది.

సృష్టి స్థితిలయాలను నిర్వహిస్తూన్న దివ్యశక్తులు రెండే రెండు! కామం, మృత్యువు

ఇది కామం; అది మృత్యువు!

ఇది ఎర్రగా, ప్రకాశవంతంగా వుంటుంది; అది నల్లగా, నిదితుని చుట్టూవున్న చీకటిలా వుంటుంది!

ఇక్కడ వేడి చైతన్యం వున్నాయి; అక్కడ చల్లదనం స్తబ్దత వున్నాయి!

మనిషి యిక్కడ మంచీ చెడ్డా రెండూ చేస్తాడు; అక్కడ ఏదీ చెయ్యడు!

ఇక్కడ బిడ్డ క్యారుమంటుంది; అక్కడ ముసలివాడి మూలుగు ఆగిపోతుంది!

ఇది జాగ్రత; అది నిద్ర!

సలసలమరిగే ఈ ఎర్రటి కామప్రవాహం సృష్టి ఆదినుండీ ఇలా ప్రవహిస్తూనేవుంది నిరంతరమైన సూర్య తేజంలా — అక్షయంగా ప్రాణసృష్టిని కరిపిస్తూ, వసుంధరకు బిడ్డలులేని లోటును తీరుస్తూనేవుంది. ఇది యిలా ప్రవహించి ప్రవహించి, మృత్యువు అనే నల్లని, చల్లని మహా సాగరంలో సంగమిస్తోంది.

ఈ ఎర్రటి కామగోళం పూర్తిగా కరిగిపోయే దెప్పుడు?

ఆ నల్లటి మృత్యుబిలం పూర్తిగా కప్పుకు పోయేదెప్పుడు ?

...వద్దు, వద్దు ! ఓ కామమా ! నువ్వు పూర్తిగా కరిగి పోవద్దు ! నువ్వు లేకపోతే ఈ ప్రపంచమే లేదు  నువ్వే లేనినాడు– ఈ కొండలు, కోనలు, నదులు, జలపాతాలు, నేల, నింగి, గాలి, వాన అన్నీ నిరర్థకం ! నువ్వు చిరంజీవిగా వర్ధిల్లు ! విశ్వమంతటా నువ్వే నిండిపో ! మా కళ్ళకు కనిపించే ఊర్ధ్వ లోకాల్లోనూ నీ సామ్రాజ్యాన్ని విస్తరింపజెయ్యి ! నా తల్లికి కట్టినట్లే – నా పెత్తల్లులకు, పినతల్లులకు, ఇంకా దూర దూరాల్లో కాపరాలు చేస్తున్న ఆ తెల్లటి చుక్కలకు పచ్చని కోకలు కట్టు ! వాళ్ళ గొడ్డాలితనం పోగొట్టి, చవిటి పర్రల్లాంటి వాళ్ళ ముఖాలమీద నవ్వులు మొలకలెత్తించు !

అతనికి సుశీల జ్ఞాపకానికొచ్చింది. తనలోనుండి విడిపోయి, స్త్రీగా జన్మించిన తన అర్ధశరీరం ఆమె ! ఆ పలుచని పెదాలు, నున్నని బుగ్గలు, సన్నని మెడ, పొంకంగావున్న కుచాలు, నల్లటి జడకుచ్చుల్ని ఉయ్యాలలూపే గుండ్రని పిరుదులు, మెత్తని పొత్తి కడుపు, ఆ సొగసూ ఆ వయసూ అన్నీ తనవే!... గత ఆదివారం రాత్రి తానేంచేశాడు ? ఆమెను ముద్దెట్టుకున్నాడు. కావిలించుకున్నాడు. చాపల్యంచేత ఆమె యౌవనాన్ని చవిచూడబోయాడు. ఇద్దరికీ మత్తెక్కింది. అంతలో తనలో పొంగిపరుగులు పెట్టే రక్తానికి ఆనకట్టపడిపోయింది. రక్తం తన వేగాన్ని ఆపుకోలేక సుళ్ళు తిరిగిపోయింది. కొద్దిక్షణాలు జానకీపతి రాకుండా వుంటే ఏమైవుండేది ?...

సుందరం రక్తం వేడెక్కింది.

...సుశీల అడ్డుచెప్పలేదు. అణువునా తననే స్మరిస్తూన్న సుశీల ఎలా అడ్డుపెడుతుంది ?

పెళ్ళి అయ్యేంతవరకు ఆగితేచాలు ! తరువాత ఒకరిబొందిలో ఒకరు కాపురం చేసుకోవచ్చు ! అమృతంలాంటి ఒకరి ఎంగిలి మరొకరు తింటూ, యౌవనాన్ని పావనం చేసుకోవచ్చు !... పూలదండలా సుస్మితమైన, సుకుమారమైన, సుందరమైన సుశీల కడుపులో బిడ్డ పుడుతుంది. అది తన బిడ్డ ! తనబిడ్డ సుశీల కడుపులో ప్రాణం పోసుకుంటుంది.

'సుశీ ! ఓ నా ప్రాణమా ! నా బిడ్డకు తల్లికావడానికి మన సారా కోరుకుంటున్న దేవతా ! నీ ఋణం ఎలా తీర్చుకోగలను ? జీవితాంతంవరకు నిన్ను పూజిస్తాను. నిన్ను పూజించటానికి ఈ ప్రపంచంలో పూచే పువ్వులన్నీకూడా చాలవు  నిన్ను నా ముద్దులతో ఆరాధిస్తాను ! నీకు నా ముద్దులు ! ఎన్ని ?... వాటిని లెక్కపెట్టుకోను. అంత పెద్ద సంఖ్యలకు పేర్లుకూడాలేవు. అవి ఊహకుకూడా అందవు. ముద్దులు ! నీ ఒళ్ళంతా ముద్దులు పెడతాను ! తామర పువ్వులవంటి నీ పాదాలకుకూడా నా ముద్దులు ! వాటిని నా కళ్ల కద్దుకుంటాను. నా గుండెలమీద పెట్టుకుంటాను. నా బిడ్డను కడుపున మోస్తూ ఆ పాదాలమీదనేగా నుంచుంటావు నువ్వు ? వాటిని నా చెంపకు ఆనించుకుని నిద్రపోతాను...'

సుందరం ఓ దుకాణం దగ్గర నిలుచున్నాడు. తాను సుశీలకు ఏదైనా కొంటే బాగుంటుంది. రిబ్బన్లున్నాయి. గాజులున్నాయి. ప్లాస్టిక్ పువ్వులున్నాయి. చౌకబారు నకిలీ ఆభరణాలున్నాయి !... అట్టముక్కలకు వేలాడుతోన్న ముత్యాలహారాలు అతన్ని ఆకర్షించాయి. అవి చాలా అందంగా వున్నాయి. అన్నీ లేతరంగుల్లోవుండి, జలపాతం క్రింద చెదిరిపోయే నీటి బిందువుల్లో ప్రతిఫలించే వెన్నెల చినుకుల్లా వున్నాయి.

అతడు ఓ గులాబీరంగు హారాన్ని తీసుకుంటూ 'ఈ హారం ఎంతండీ??' అన్నాడు.

'ఆరురూపాయలివ్వండి !'

సుందరం కొట్టువాడికి డబ్బిచ్చి వెనక్కి తిరిగాడు. గౌరి ఆ హారాన్ని చూస్తూ ప్రక్కనే నిలబడి వుంది. మెల్లగా ముఖం పక్కకు తిప్పి, కొట్లోని వస్తువుల్ని చూడసాగింది

సుందరం ముందుకు సాగాడు.

చలి ఎక్కువైంది. మంచుకురుస్తోంది. దీపాలచుట్టూ మసకగా ఇంద్రధనుస్సులు ఏర్పడుతున్నాయి. అతని దుస్తులు, ఒళ్ళు చల్లబడిపోతున్నాయి.

ఇందరు ఆడవాళ్ళలో ఒక్క సుశీల వుండరాదూ?

అరే!...అదిగో సుశీల! అటువైపు తిరిగి నుంచుంది' ఆమే కదూ? పచ్చగా, పొడుగ్గా వుంది. జడకుచ్చులు బరువుగా వూగుతున్నాయి. ఆ ఒయ్యారం సుశీలదే! అంత అందమైన వీపు ఆమెకు తప్ప మరెవరి కుంటుంది? అయితే, సీతాకోక చిలుకలా అలాంటి రంగురంగుల బట్టలు సుశీల కట్టుకుంటుందా? ఎర్రని జాకెట్టు ఆకుపచ్చనిపరికిణీ ! పసుపు పచ్చని వోణీ !

ఆ అమ్మాయి యిటువైపు తిరిగింది. కాటుక కళ్ళు తళతళ లాడుతున్నాయి. ఎర్రటి పెదాలమీద నవ్వు తీగలు సాగుతోంది. ఒక చెయ్యి నడుంమీద వుంచుకుని మరో చెయ్యి బొడ్డుమీదుగా మడిచి పెట్టుకుని, నృత్యం చెయ్యడానికి ముందు నిలబడే భంగిమలో వుంది. సుందరం నిరాశ చెందాడు. ఆమె సుశీల కాదు.

కొందరు పిల్లలు బీడీ ప్రకటనలు అంటించిన అట్టముక్కలు చేతబట్టుకుని కేకలు పెడుతూ వస్తున్నారు. మనుషుల నెత్తిమీద బీడీలు కురుస్తున్నాయి సీతాకోక చిలుకలాంటి ఆ అమ్మాయి ఇటు వేపే నడిచివస్తోంది. ఆమెకాళ్ళలో అందెలు ఘల్లుఘల్లు మంటున్నాయి. ఆమె ముఖంలో మెరుస్తున్న నవ్వు, నడకలోని ఊపు చూస్తుంటే- ఒకే సమయంలో ఎందరో మగాళ్ళను తృప్తిపరచ జాలినంత లాలసత్వం ఆమెలో వున్నదనిపిస్తోంది.

ఆమె దగ్గరగా వచ్చింది. ఆమె చుట్టూ పెద్ద గుంపు కదిలి వచ్చింది. ఆమె ఆగింది అరే! నృత్యం చేస్తోంది నడుము ఎంత బాగా కదులుతోంది! చేతులు ఎంత అందంగా వంపులు తిరుగుతున్నాయి! ఆమె ఆడుతూ పాట పాడుతోంది పాట శ్రావ్యంగా వుంది. గొంతు చిత్రంగా వుంది! మొగగొంతులాంటి ఆడగొంతు! ఆడగొంతు లాంటి మగగొంతు! ఆమె ఆడపిల్లకాదు! మగవాడే! ఆడపిల్లకంటే బాగున్నాడు!

అకస్మాత్తుగా సుందరం చూపులకు గౌరి కనిపించింది ఆమె అతనికి ఎదుటివైపున నిలబడి వుంది. ఇద్దరు ఆడవాళ్ళ భుజాల వెనుకనుంచి దొంగచూపులు చూస్తోంది ఆమె చూపులతో సుందరం చూపులు కలుసుకోగానే, ఆమె పెదాలమీద మధువులాంటి నవ్వు వొలికింది. సుందరం గుండె ఝల్లుమంది అనుకోకుండా ఎదురైన తుఫాను వేగానికి నిలకడ కోల్పోయే చిలుక రెక్కల్లా—అతని కళ్ళు తటతటలాడి కిందికి వాలిపోయాయి.

గౌరి నవ్వింది!...ఆ నవ్వులో కత్తిపదును వుంది. ఆ కళ్ళలో కైపులున్నాయి. సందేహ నివృత్తికోసం సుందరం మళ్ళీ ఓమారు—క్షణంలో పదోవంతుకాలం—ఆమెవైపు చూశాడు. ఆమె తననే చూస్తూ వుంది. నవ్వు—ఆమె ముఖంలో తాటాకు మంటలా ధగ ధగ మంటోంది

సుందరం అక్కడ నిలబడలేకపోయాడు. దూరంగా వెళ్ళిపోయాడు. విషనాగు తనను తరుముకొస్తున్నట్లుగా వుందతనికి, గౌరి కంటబడకుండా దాక్కోవాలనిపిస్తూంది ఈ దీపాలన్నీ ఆరిపోయి, కారుచీకట్లు అలా కళ్ళకు గంతలు కడితే బాగుంటుందనిపిస్తోంది 'గౌరీ' నీలో ఇలాంటి విపరీతమైన మార్పు వస్తుందని నే ననుకోలేదు. నన్ను చూచి అలా నవ్వకు, నా కంటికి కనిపించకు. నీ నవ్వు ద్రాక్షారసంలా వుంది అది—నా గుండెల్ని చీల్చేసి, నారక్తాన్ని గుటగుటా తాగేసి, నా ఎముకల్ని చప్పరించి వుమిసివేయగలిగినంత శక్తివంతంగా కనిపిస్తోంది ఆనవ్వు మానిపోనీ! ఆ నవ్వుకంటే నీ ద్వేషమే మనిద్దరికి ఆరోగ్యకరం! ...'

ఈ రాతికి బుద్ధిలేదు ఇది కళ్ళులేని కబంధరాక్షసి! ముక్కువాకా తాగి, దీనికి మత్తెక్కింది. దీనికి వున్నవి రెండే! బ్రహ్మాండమైన కడుపు, తీరని ఆకలి! దీనికి తృప్తి లేదు దయ లేదు హృదయంలేదు ఇది – తనకేదో ప్రమాదానికి రంగాన్ని సిద్ధంచేయబోతున్నది!

ప్రమాదం!

గౌరి తనతో చెలగాటమాడుతూవుందా?

లోకంలో జరిగే హత్యలకు, అత్యాచారాలకు మూలకారణాలు ఎన్నైనా వుండవచ్చు. ఆడది, ఆస్తి, అభిమానం. అసూయ! వీటిలో ప్రముఖస్థానం ఆడదానిదే! ఆత్మహత్య స్త్రీలలో ఎక్కువగా వున్నట్లే, హత్యలకు కూడా స్త్రీలే ఎక్కువగా కారణం అవుతుంటారు! ··· గౌరి తనను చూచి అలా నవ్వటం వాళ్ళ వాళ్ళెవరైనా చూస్తే? ప్రమాదమే!... పైగా గౌరి సామాన్యురాలు కాదు. నిప్పులాంటిది! కాగితం నిప్పుమీదపడ్డా, నిప్పు కాగితం మీద పడ్డా- భగ్గుమనేది కాగితమే!

ఇప్పుడు రామలింగం తనకు తోడుగావుంటే బాగుండేది. అతని ఆనందంకోసం తనను యిలా వదిలేసి వెళ్ళిపోయాడు. తనతో వాడికేంపని? సృష్టిలో తీయనిది స్నేహం - అంటారు స్వజాతి స్నేహంకంటే విజాతిస్నేహం—ఆడా మగా స్నేహం—మరింత తీయగా వుంటుందేమో? తాటిబెల్లంలాంటి ఆ నల్లటిపిల్ల దొరికిం తర్వాత—ఇక మగవాడిస్నేహం వాడికెందుకూ?...సుందరానికి కోపం వచ్చింది. రామలింగం కనిపిస్తాడేమోనని చుట్టూ ఓ సారి వెదికాడు. రామలింగం అంత సులభంగా కనిపిస్తాడా? ఎన్ని వాకిళ్ళ గొళ్ళెం పెట్టుకుని లోపలికి వెళ్ళిపోయాడో!

గుడిముందరనుంచి పూల తేరు కదిలివస్తోంది. జనం విరగబడిపోతున్నారు.

సుందరం రోడ్డుమీదికి వచ్చాడు.

రోడ్డువారవున్న టీకొట్టు ప్రక్కగా — పట్టుచీర కట్టుకున్న ఓ కొత్త పెళ్ళికూతురు నిద్రకళ్ళలో, నిద్రపోనివ్వని కోరికలతో, భర్త భుజంమీద తలవాల్చి కూర్చునివుంది. అతడు ఆమె వీపు నిమురుతున్నాడు. వర్షంలో తలదాచుకోవటానికి చోటు దొరకని కుక్కపిల్లలా కామం మూలుగుతోంది వారివెనుకవున్న గోడమీద చిత్రించిన బొమ్మలో నాలుగు తలలు, ఎర్రటి త్రికోణం వున్నాయి.

'ఇద్దరు, లేక ముగ్గురు చాలు !'

చలిగాలి మంచుకత్తిలా శరీరాన్ని కోసివేస్తోంది యుద్ధభూమిలోని నిగత జీవుల్లా—అంతటి చలిలోనూ, కొందరు మనుషులు రోడ్డువారపడి నిద్రపోతున్నారు.

సుందరం తలపైకెత్తి చూశాడు.

ఆకాశంలో చుక్కలు ఆరిపోయాయి.

తప్పతాగి కేళీగృహంలోకి ప్రవేశించిన విటునిలా ఆకాశం అస్పష్టంగా వురుముతున్నది.

* * *

చీకటి !

ఉత్సవకోలాహలం క్రమంగా దూరమైంది.

మసకవెలుతుర్లు వెనుకపడ్డాయి.

సుందరం రోడ్డుమీద నడుస్తున్నాడు. అతనికాళ్ళు తిమ్మిరెక్కిపోయాయి. రంగులరాట్నంలోంచి కిందికి దిగినప్పటినుంచి ఇంత వరకూ కాస్సేపైనా కూర్చోలేదు. ఆటవిక జాతులవారి ఆసురీ మహోత్సవంలావుంది తిరణాల. ఆ పరిసరాలకు దూరంగా వెళ్ళి కూర్చోవాలనిపిస్తోంది.

ఆ తిరణాల అతనికి అశాంతికరంగా తోచింది. అక్కడ వట్టి అల్లరితప్ప మరింకేమీ లేదు. శరీరం ఎక్కడ తన స్వాధీనం తప్పిపోతుందోనని భయంవేసింది. తనకు పగలైనా కావాలి, లేదా ఒంటరితనమైనా కావాలి.

అలసిన కాళ్ళు భారంగా నడుస్తున్నాయి. చీకట్లోదారి స్పష్టంగా కనిపించటంలేదు. అగ్గిపెట్టె ఒకటి కొనుక్కువచ్చి వుంటే బావుండేది. అగ్గిపుల్లలు గీసుకుంటూ నడిచిపోవచ్చు ... ఈగాలిలో అగ్గిపుల్లలు నిలిచి మండుతాయా ? గుప్పున ఆరిపోవూ?

వెనుకనుంచీ లారీ ఒకటి వస్తోంది. ఆ వెలుతుర్లో ఓసారి దారి చూసేసుకోవడం మంచిది !... వెనుక వస్తున్న లారీ మలుపు తిరిగింది. దాని వెలుగులు పక్కనున్న రైలుకట్టమీద పడ్డాయి. రైలుపట్టాలు మెరుపుతీగల్లా తళతళా మెరిశాయి. రోడ్డుమీద నడుస్తున్న సుందరం - చూపు ప్రసరించేటంత మేర ముందరికి చూశాడు కాస్త సమీపంలోనే రోడ్డు క్రిందికి వాలివుంది. ఏటిలోని ఎండుటిసుక తెల్లటి దుప్పటిలా కనిపించింది లారీ ముందుకు వెళ్ళిపోయింది

మరో నాలుగడుగులు నడిస్తేచాలు, ఆ ఏట్లో దిగి ఇసుకలో కూర్చోవచ్చు. సుందరం ఏట్లోకివచ్చి, చీకట్లోకి చూస్తూ నిలబడ్డాడు. ఊపిరి బిగబట్టినట్లు నిశ్శబ్దంగావుంది నిశీధి నీళ్ళలో తెప్పలేసినట్లు ఓ ఆడదాని నవ్వు వినిపించింది. దూరంగా ఏటివార మొగిలిపొదల క్రింద బీడీనో, సిగరెట్టో వెలుగుతోంది. ఆ వెలుగు ప్రక్కనే తెల్లటిచీర మసకగా కనిపిస్తోంది

సుందరం మళ్ళీ ముందుకు నడిచాడు.. అవి మొగిలిపొదలే ! తనకు బాగా గుర్తు! పగటిపూట చాలాసార్లు తాను బస్సులో వెడుతూ ఆ మొగిలి పొదలను స్పష్టంగా చూశాడు. మొగిలి చెట్లలో మిన్నాగు లుంటాయట !...మరివాళ్ళు మొగిలిచెట్ల క్రిందే మకాం పెట్టారే! ఎంత ధైర్యం! అందుకే అన్నారు, కామానికి కళ్ళులేవని!

వాళ్ళిద్దరూ ఎవరైవుంటారు?.. అతని ఊహలో రామలింగం మెదిలాడు . ఇంకెవరైనా ఎందుకు కాకూడదు ? .. వాళ్ళు భార్యాభర్తలా ? బావా మరదళ్ళా ? కట్టుకున్న మొగుణ్ణీ, పిల్లల్నీ మాయచేసి వచ్చి బులపాటం తీర్చుకుంటున్నవాళ్ళా ? అదే అయి వుంటుంది. అది అక్రమ సంబంధంకాకపోతే — స్థలకాల నియమాలు పాటించకపోవలసినంత తొందరేముంది ? భార్యాభర్తలే అయితే ఒక్కరోజు సహనం వహించలేరా ? ... అక్కడ ఆ టీకొట్టువార — ఆ కొత్తదంపతులిద్దరూ 'ఈశ్వరా !' అంటూ కూర్చోలేదూ, పాపం !

'...అయ్యో ! నేను కామాన్ని ఒక రూపంలోనే చూశాను. దానికి యింకో రూపం కూడావుంది. ఒక రూపంలో పవిత్రత,

ఒకేరూపంలో అపవిత్రతా వున్నాయి- దినంలో రాత్రీపగలూ వున్నట్టు శోభనంగదిలోకి వెళ్ళే పెళ్ళి కూతురి కామం చాలా పవిత్రమైనది. అర్ధరాత్రివేళ దొడ్డి తలుపుతీసుకుని బయటకువెళ్ళే మగనాలికామం చాలా అపవిత్రమైనది. ఒకటి దేవుడి గుడిలో దీపం లాంటిది! రెండోది-వల్లకాటిలో మండే చితిలాంటిది! ఒకటి రక్షిస్తుంది! మరొకటి భక్షిస్తుంది!

ఆకాశంలో ఉరుములు ఎక్కువయ్యాయి.

మెరుపు మెరిసింది.

సుందరానికి సంతోషం కలిగింది.

తళుక్కున వెలిగి మాయమైపోయే ఫ్లాష్‌లైట్ ఫిలిం మీద బొమ్మను రికార్డు చేసేస్తుంది. ఫ్లాష్‌లైట్‌లాంటి ఈ మెరుపు సహాయంతో- ఈ పరిసరాలను తన కంటిలో రికార్డు చేసుకోవాలి.

సుందరం ఆగిపోయాడు.

మరో మెరుపు మెరిసింది

రోడ్డుప్రక్కన నేల చదునుగావుంది. రాళ్ళూ, ముళ్ళూలేవు. శ్రమలేకుండా నడిచిపోవచ్చు, ఓ ఏభై గజాలదూరంలో విశాలమైన తెల్లటిబండవుంది.

సుందరం రోడ్డు విడిచి ఆ బండవైపు నడిచాడు. అతనికి అంధకారం అంటే భయంపోయింది చీకట్లో ఏముంది? ఏమీలేదు! వెలుతుర్లో కనిపించే వస్తువులే చీకట్లోనూ వుంటాయి. ప్రాణహాని కలిగించే జంతువులను గురించే-చీకట్లో భయపడాలి! శత్రుశేషం వుంచకూడదనేది మానవుడి నీతి! వాడిదెప్పుడూ ముందు జాగ్రత్త! వాడొక్కడే బ్రతకాలి! వాడికి భయాన్ని, అనుమానాన్ని కలిగించేవన్నీ చావాలి! పులులు, సింహాలు మొదలైన క్రూరమృగాలన్నీ దాదాపుగా నిశ్శేషమై పోయాయి. మచ్చుకు మిగిలిపోయిన కొన్నిమాత్రం దూర దూరంగా పారిపోయాయి. జంతుభయం తీరిపోయింది. మనుష్యులు విశేషమై పోయారు ఇప్పుడు మనిషిని గురించి భయపడుతున్నాడు. మనిషికి మనిషి శత్రువైపోయాడు. శత్రుశేషం వుండరాదు గనుక ఒకణ్ణొకడు నరుక్కుచావాలి!

చీకట్లో ఏముంటుంది?

మనిషి వుంటాడు!

పాములూ, తేళ్ళూ కూడా వుండవచ్చు. అయితే అవి అరుదుగానే వుంటాయి!

'నాకు మనిషంటే భయంలేదు, చీకటంటే భయం!' అనవద్దు. అది ప్రగల్భం!

'నాకు చీకటంటే భయంలేదు, మనిషంటేనే భయం!' అను అదే నిజం!

మెరుపుకాంతిలో-మనిషి, పాము, తేలు-ఈ మూడు విష జంతువులూ కనిపించలేదు సుందరానికి. అతను మెల్లగా వెళ్ళి, బండ మీద కూర్చున్నాడు.

...ఇక్కడ హాయిగా వుంది.

మెదడును తొలిచే మత్తు, మనస్సును గుడ్డిగా చేసివేసే మిరుమిట్లు ఎక్కడలేవు ఇక ప్రమాదంలేదు. పిశాచాల బారినుండి ఇక్కడికి-తన సుశీల దగ్గరికి పారిపోయి వచ్చేశాడు తాను. తన సుశీల యిక్కడే వుంది! ఈ చీకట్లోవుంది. ఈ చలిలో వుంది ఈ గాలిలో వుంది. ఆకాశంలో వుంది నిద్రపోతున్న ఈ ప్రకృతి గుండెలమీద వుంది తన హృదయంనిండా వుంది. ఆలోచనలకు అంతరాయం కలుగని ఈ ఏకాంతంలో సుశీల వుంది. మండుటెండలాంటి ఈ నడిరేయిపూట-సుశీలను గూర్చిన తలపోత-కానుగ చెట్టు నీడలా హాయిగా వుంది. తనకు ఈ ఏకాంతమే చాలు!

సుందరం బండమీద వెల్లకిలా పడుకున్నాడు బండ చల్లగా వుంది. చలనంలేని ఈ కఠిన శిలలుకూడా పరిస్థితుల ప్రభావానికి గురికాక తప్పడంలేదు. మిటమిటలాడే ఎండలకు ఈ బండలు బీటలు పడిపోతాయి. మంచుకు, వానకు, చలికి-మృతదేహాల్లా చల్లబడి పోతాయి. రక్తమాంసాలున్న మానవ శరీరాలు ఏపాటి? ఈ ఒడలు చాలా సున్నితమైనది. సుకుమారమైనది కర్ణుడిపాలిటి శాపాల్లాగా ఈ శరీరానికెన్నో తాపాలు! ఆకలి దప్పులకు, బాధలకు, వ్యధలకు ఇది ఆహారం! అన్నం తక్కువైతే శోష! ఎక్కువైతే అజీర్తి! ఎండను భరించదు! చలికి ఓర్చుకోదు! బ్రతుకూ సమస్యే! చావు సమస్యే!...

'ఈ చలిని నేను జయించలేనా? ప్రయత్నిస్తాను. ఈ చలిలో నేనొక్కడే వున్నానా? ఈ బండలు. ఆ కొండలు. చీకట్లో కదలకుండా నుంచున్న చెట్లు ఎంత సహనంగా వున్నాయి! తెల్లవారగానే ఇవన్నీ మళ్ళీ ఊపిరి పోసుకుని, సంతోషంగా నవ్వుతాయి! నేనూ అలాగే స్థాణువులా చలిని భరించి, తెల్లవారేసరికి హాయిగా నవ్వు

తాను. ఆశావహమైన భవిష్యత్తు చేతిని భరించే శక్తిని ప్రసాదిస్తుంది. రేపు నాది! రేపు ఆదివారం! ప్రక్కనే రోడ్డు వుంది. తెల్లవారు జామున—నిర్మలంగా వెలిగే వెచ్చటి కళ్ళతో బస్సులు వెడుతుంటాయి. సుశీల వాళ్ళ వూరు ఇక్కడికి దగ్గరే! పదిమైళ్ళే! రేపు సుశీల దగ్గరుంటాను. చాటుగా ఆమె కంఠంలో ముత్యాలహారం వేస్తాను. చెవిలో నోరుపెట్టి, ఈ రాత్రి నాకేమనిపించిందో చెబుతాను. సుశీల సిగ్గుపడుతుంది. ఛీ, పో బావా—అంటుంది. ఆహా! ఎంత మంచి ఆదివారం! అందమైన ఊహలాంటి ఆదివారం! అరుసము దాటి కవతల క్షీర సముద్రంలాంటి ఆదివారం ...హే సూర్య భగవన్! తొందరగా ఉదయించవయ్యా మహానుభావా!'

సుందరం కళ్ళు మూసుకున్నాడు.

ఇంతే ..ఇంకేమీ ఆలోచించకూడదు. శరీరం, మనస్సూ రెండూ అలిసిపోయాయి. కదిలేశక్తి శరీరానికి, ఆలోచించేశక్తి మనస్సుకు లేవు ఓ నా సహచరులారా! ఇక మీరిద్దరూ వూసులాడుకోవటం చాలించండి! పడుకుని నిద్రపోండి! నాకు ఆవలింత కూడా వస్తోంది. నా కళ్ళు మండుతున్నాయి. చలికి దుప్పట్లులేవు. సుశీలను తలుచుకుంటూ నోరు మూసుకుని పడుకోండి! ఉయ్యాలలో క్యారుమంటూ ఏడ్చే కవలపిల్లల్లా మారాం చెయ్యకండి!... జో జో హాయీ...

అతడు గుండెలమీద చేతులు ముడుచుకున్నాడు. ముఖంమీద ఓ చినుకు పడింది అతడు పెకిలేచలేదు. కళ్ళు తెరవలేదు. అలసిపోయిన అతని మెదడు ఎప్పుడో గాఢంగా నిద్రపోయింది. మేలుకున్న శరీరం మాత్రం చలికి వణుకుతోంది. మిన్ను విరిగి మీద పడ్డా - అతని మెదడు యిక మేలుకోదు.

చాలా దగ్గరలో గాజుల చప్పుడు వినిపించింది.

సుందరం చివాలున లేచి కూర్చున్నాడు.

అతని ఎదుట ఓ నల్లటి ఆకారం నిలబడివుంది.

'ఎవరు ?' అన్నాడు సుందరం.

'నేనే !'

'నేనే అంటే ?...'

ఎవరు ? దేవుడివా ? దేవుడుతప్ప ఇతరమైనదేదీ లేదంటుంది వేదాంతం.

...ఓ సన్నటి నవ్వు!

ఆకాశంలో మెరుపు మెరిసింది. ఆ మెరుపు నేలమీదికి దిగి వచ్చినట్లుగా—నిట్టయెదుట ఎరటి గౌరి నవ్వుతూ నిలబడివుంది. 'నే నెవరని ఈ మెరుపుకంటే స్పష్టంగా చెప్పగలనా ?' అన్నట్లు చూస్తూవుంది.

సుందరం గుండెలో ఉరుములు ప్రతిధ్వనించాయి. నిద్రపోతున్న అతని మెదడు ఉలికిపడింది.

'అబ్బ! ఇంతదూరం వచ్చావా! నీకు భయంలేదూ ?' అంది గౌరి.

...నేను అడగవలసినమాట నువ్వడుగుతోందేమిటీ ?...గౌరీ! నాకు చీకటంటే భయంలేదు. నీకు మనుషులంటే భయంలేదు. నువ్వు చీకటికి భయపడుతున్నావు, నేను నీకు భయపడుతున్నాను...

'ఇక్కడి కెందుకొచ్చావు ?' అన్నాడు సుందరం.

గౌరి అతనికి దగ్గరగా వచ్చికూర్చుంది. ఆమె గొంతు సిగ్గుతో జీరపోయింది. 'ఎవరూ చూడలేదులే' అంటూ తలవంచుకొంది.

ఛీఛీ!...ఆడదానిసిగ్గు ఎంత అందంగా వుంటుంది!... ఈ సిగ్గు అసహ్యంగావుంది. 'ఎవరూ చూడలేదులే!'—ఈ ఒక్కమాటలో తెరలోపలి మర్మంలా ఎన్నిఅర్థాలున్నాయి!

...వికృతమైన ఊహల ఇనుప పాదాలక్రింద నా గుండె చితికిపోయి, చచ్చిన పాములా ఇక్కడ పడున్నాను నేను గౌరీ! చచ్చిన పామును కొట్టడానికా నువ్వు వచ్చావు!...

సుందరం గుండె కొట్టుకుంటోంది. మాటాడాలంటే వగర్పు వస్తోంది. 'ఎందుకొచ్చావు ? అన్నాడు కాస్త కోపంగా.

'ఏం ? రాకూడదా ?' అంది ఆమె జాలిగా. అతని ప్రశ్న తన మనస్సుకు కష్టం కలిగించిందన్న భావాన్ని సూచించింది ఆమె స్వరం.

'నే నిక్కడికి నిద్రపోదామని వచ్చాను గౌరీ!'

ఆమె నవ్వింది.

'ఎంత చిత్రం! ఇంత చలిలో, ఈ చినుకుల్లో నీకు నిద్రపోదామనిపిస్తోందా ? ...అబద్ధం!'

'నిజం గౌరీ! నువ్విక్కణ్ణుంచి వెళ్ళిపో! నిద్రపోతానో,

లేదో చూడు!...నువ్వు వెళ్ళకపోతే, నేనే లేచి వెళ్ళిపోతాను.'

'అమ్మో! నాకు భయం!' అంటూ ఆమె అతన్ని లేవనియ్యకుండా చెయ్యిపట్టుకుంది

'చెయ్యి వదిలిపెట్టు!'

'నీకు నామీద కోపం!'

'నీమీద నాకేం కోపం?'

'అవును. మావాళ్ళు నిన్ను కొట్టారుగా?'

'కొడితే కొట్టారు ఇప్పుడు మళ్ళీ ఇదేమిటీ?'

ఆమె జడకుచ్చులు తీసి బుగ్గలకు రాసుకుంటూ 'మావాళ్ళతో చెప్పన్నా!' అంది.

'ఛీ!!

'అలా నన్ను చిన్నబుచ్చకు సుందర్! నీపైన నాకేమీ విరోధం లేదు వాళ్ళు నిన్ను కొట్టినందుకు తరవాత నేనెంత బాధపడ్డానో నీకు తెలుసా?.. పాపం, నావల్లేకదూ నువ్వు దెబ్బలు తిన్నది?'

'ఇప్పుడెందుకదంతా?'

'...నువ్వు తిరిగి కొట్టకపోయినా, నీదే గెలుపు! నువ్వు చాలా ధైర్యవంతుడివి సుందర్! ఆ మాట అన్నావా-అని మా నాన్న నిన్ను అడిగినప్పుడు, నువ్వు పిరికివాడిలా అబద్ధం చెబితే చూడాలని ఆశ పడ్డాను. నువ్వు ధైర్యంగా నిజమే చెప్పావు. నేనే ఓడిపోయాను.'

'నిన్ను యింకా చిత్తుగా ఓడించడం నాకు ఇష్టంలేదు గౌరీ! వెళ్ళిపోదాం పద!'

'అబ్బ! చలేస్తూవుంది! ఎక్కడికి వెళ్ళినా అంతేకదూ?' అంటూ ఆమె వొయ్యారంగా అతని భుజంమీదికి వాలింది. ఆమె తలలో పువ్వులు ఘుమఘుమలాడాయి. చల్లని చెంప, వెచ్చని నిశ్వాస చెంపకు తగిలాయి.

సుందరం ఆమెను మెల్లగా నెట్టాడు.

'నువ్వు కొన్న ఆ గులాబీరంగు హారం చాలా బాగుంది. అది నాకు నచ్చింది.'

'అది నీకోసం కాదు.'

'అబ్బో! వేళాకోళం!' అని నవ్వుతూ గౌరి అతని మెడ చుట్టూ చేతులు వేసింది.

సుందరం కోపంతో పైకిలేచి, విసురుగా వెళ్ళబోయాడు. వెనుక అతని చొక్కా గుంజినట్లైంది. గౌరి పకపకా నవ్వుతోంది.

'గౌరీ! విడిచిపెట్టు!'

'నేను విడిచిపెట్టేదేమిటీ? నువ్వే విప్పుకో!'

సుందరం తిరిగి చూశాడు తన చొక్కా చివర ఆమె కొంగు ముడివేయబడివుంది.

'ఏం కొంటెపనులివి?' అన్నాడు కోపంగా.

'ఏం కొడతావా? కొట్టు! ఎవరూ లేనిచోట ఆడపిల్లను కొట్టడం నీకే తగును!'

'ఛీ ఛీ! నీతో భలే తంటా వచ్చిపడింది. విప్పేసెయ్ మరి!' అంటూ చిరాకుపడ్డాడు సుందరం.

ఆమె తన కొంగును కిందికి లాగింది సుందరం కూర్చున్నాడు. ఆమె అతనికి దగ్గరగా జరిగింది. కొంగు ముడివిప్పుతూ— 'అది మహా జాణ!' అంటూ నవ్వింది.

'ఎవరు?'

'అదే! మాలతి!'

'మాలతి ఎవరు?'

'ఆ నల్లటిపిల్ల!...రామలింగంతో వెళ్ళింది చూడూ, అది!'

'రామలింగం మోసగాడు!'

'మాలతి కూడా! ... వాళ్ళిద్దరూ యిప్పుడెక్కడుంటారో చెప్పుకో చూద్దాం!'

'ఎక్కడుంటారు?'

'తెలియదు!' అంటూ నవ్వింది గౌరి. 'ఇప్పుడు మనిద్దరం యిక్కడున్నామని కూడా వాళ్ళకు తెలియదు.'

'గౌరీ!'

'ఊఁ?'

'ఇలా దగ్గరకురా!'

'...వచ్చాను. ఏం?'

అతడు ఆమెముఖాన్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు జాలి పడుతూ ఆమెకళ్ళలోకి చూశాడు. ఆ కళ్ళలో కామవాంఛ నాలుకలు చాపుతూవుంది. ఆ వాంఛలో ప్రమోదకమైన అమాయకత్వం కూడా తొంగిచూస్తోంది. అంత పెద్దపిల్ల అతనికంటికి పాపాయిలా కనిపించింది.

'నువ్వు చాలా గడుసుదానివనుకున్నాను. ఇంత వెర్రిదానిలా వున్నావేం?

ఆమె కొండ కొమ్మను ముద్దు పెట్టుకునే శరన్మేఘంలా పులకించి, అతని గుండెలమీద తల వాల్చుకోబోయింది.

'వద్దు గౌరీ!...నువ్వు మంచిదానివి! నామాట వింటావు. మనిషి సహజంగా మంచివాడు. నదిలాంటివాడు. ప్రశాంతంగా పారే ఏరు మనకెంత మేలు చేస్తుంది! ఆ ఏటికి వరదొస్తే ఊళ్లనే ముంచేస్తుంది. మనిషి తప్పుచేయటంకూడా సహజమే! తప్పు జరగబోయేముందు ఆలోచించాలి. నిగ్రహాన్ని పాటించాలి. అప్పుడు తప్పు జరగదు. బతుక్కి మచ్చలు, మరకలు రావు. చిన్న ఉప్పురాయి పడితేచాలు. కడివెడు పాలు చెడిపోతుంది. చిన్న నిప్పురవ్వ గాలికెగిరితేచాలు పచ్చని పందిరి బూడిదైపోతుంది. అదృష్టం లేని బతుకు బండలైపోవటానికి చిన్న తప్పేచాలు!. కోరిక సారాలాంటిది. సారాపేపు చూచేకొద్దీ తాగుబోతుకు తాగాలనిపిస్తుంది. కోరికమీద మనస్సు లగ్నం చేసేకొద్దీ, కళ్ళకు మైకం కమ్ముకుంటుంది. ఈరాత్రి దయ్యానికి పెత్తనం అప్పజెప్పి, దేవుడు తాగుబోతులా నిద్రపోతున్నాడు. ఈ చీకటి, ఈ చలి, చాటు వెతుక్కుంటున్న ఈ మనుషుల ఉన్మాదం అమాయకమైన మన మంచితనంమీద అసూయపడి, కుట్టేస్తున్నాయి. నువ్వు తాగలేదు. నేనూ తాగలేదు. అయినా-మత్తు మన నరనరంల్లోకి జివ్వుమంటూ పాకిపోతోంది. ఆలోచన కళ్ళు మూసుకుంటోంది. గడిచిపోయిన సాయంకాలం, మళ్ళీ రాబోయే ఉదయం జ్ఞాపకం రావటంలేదు. కోరిక మనిషిచుట్టూ కాటుక ముద్దలాంటి కోటను కట్టేస్తుంది. ఆ కోటలోకి వెలుతురు రాదు. అంతా చీకటి! రంగులు కనిపించవు. ఆకారాలు కనిపించవు. ఎత్తుపల్లాలు కనిపించవు. అగాధంలో సుళ్ళు తిరిగే నల్లని నీళ్ళలాంటి కోరిక మాత్రమే వుంటుంది. దాని అంచులు కసాయికత్తిలా పదునైనవి. అది క్రూరమైనది. దానికి దయలేదు. దాని దాహం తీరేవరకు అది శరీరాన్ని అతి క్రూరంగా శాసిస్తుంది. చిత్రహింసలు పెడుతుంది వద్దు గౌరీ! ... ఈ కోరిక తుఫానులో దొర్లే సముద్రంలాంటిది. మనం దానిలో అడుగు పెట్టడం ప్రమాదం. తుఫాను అణిగిపోయాక- మునిగిపోయిన పడవల్లా మనం కోరికలకింద సమాధి అయిపోతాం. ఈ చిత్రహింసను భరించు గౌరీ!...మనకిలా పిచ్చిపట్టడం చాలా సిగ్గుచేటు! ఇప్పుడు మనకేమీ తెలియదు. తెల్లవారాక సిగ్గుపడతాం! ఒకరి ముఖాలొకరు చూసుకోలేము. ఎందుకిలా చేశామని బాధపడతాం. నువ్వెవరో, నేనెవరో! ఒకరి ముఖం ఒకరు చూచుకోకుండా, ఒకరిని గురించి ఒకరు ఆలోచించుకోకుండా మనం ఇన్నాళ్ళూ వుండలేదూ? ఇక రేపు, ఎల్లుండి, చచ్చిపోయే ఆ చివరిరోజు కూడా అలాగేవుందాం! ఇక్కడ మనం కలిసి తిరిగిన ఈ ఒకటి రెండు గంటల్లోనే మనబుద్ధి పెడదారి తొక్కడం ఇది వట్టి గారడీ!... ఇంక కొన్ని గంటలు గడిచిపోతే ప్రమాదం వుండదు గౌరీ! తెల్లవారిపోతుంది. ఈ తాపం చల్లారిపోతుంది హాయిగా నీరెండ కాస్తుంది పచ్చగా చెట్లు నవ్వుతాయి. నువ్వు యింటికి వెళ్ళిపోతావు ఈ రాత్రి పడిన బాధంతా మరిచిపోతావు. నీచుట్టూ మనుషులుంటారు నీ చేతినిండా పని వుంటుంది. నీ మనస్సు—ఎముకల్ని నమిలే చెడ తలపుల మీదికి పోకుండా, బుద్ధిగా వుంటుంది. మనం చాలా మర్యాదగా నడుచుకుంటాము. నీదారి నీది! నాదారి నాది! అది మంచి పద్ధతి గౌరీ! .. కోరికను జయించు! నావల్ల నీకేమీ ప్రమాదం వుండదు. నీకూ, నాకూ ప్రమాదాన్ని తెచ్చిపెట్టకు! .. మనస్సును మళ్ళించుకో! వేరే ఆలోచనలు పెంచుకో! నువ్వు పెళ్ళి కావల్సిన పిల్లవు! మీనాన్న నీకు తొందర్లో పెళ్ళిచేసేస్తాడు నీభర్త నిన్ను కోరికోరి చేసుకుంటాడు. నువ్వు — వాసన చూడని పువ్వు అనుకుని అతడు ఆనందిస్తాడు. నీకు నిగ్రహం వుంది అతనికోసం నీ పవిత్రతను కాపాడుకో గౌరీ!..

గౌరి ఆమాటలువిని దూరంగా జరిగింది ఆమెనోట మాట రాలేదు సిగ్గుపడుతూ తలవంచుకు కూర్చుంది అవమానం ఆమె ముఖాన్ని నమిలేసింది:

చిటపటమని పడుతూన్న చినుకులు ఒక్కసారిగా జవసత్వాలను పుంజుకున్నాయి హోరున వర్షం ప్రారంభమైంది.

సుందరం పైకిలేచాడు. 'వెళ్ళిపోదాం రా గౌరీ! వాన ముంచుకొచ్చేస్తోంది!' అంటూ బండమీదినుంచి కిందికి వచ్చాడు. గౌరి పైకి లేచి మెల్లగా అతన్ని అనుసరించింది.

సుందరం రోడ్డుమీదికి వచ్చాడు. గౌరి నాలు గడుగులు వెనక బడింది అతడు వెనక్కి తిరిగాడు. ఆమె వంగి నేలమీద కూర్చున్నది.

'రా గౌరీ!'

ఆమె పలుకలేదు

అతను దగ్గరకు వెళ్ళాడు.

గౌరి కూర్చుని ఏడుస్తోంది

'ఎందుకూ?' అన్నాడతను.

'ముల్లు విరిగింది!'

'లాగి పారెయ్! నొప్పి వింతో సేపు వుండదు.'

'లోతుగా దిగింది సుందర్!' అంటూ ఆమె ముల్లు లాగి పారేసింది అతనిచేయి పట్టుకుని పైకి లేచింది.

ఇద్దరూ చేయిచేయి పట్టుకుని రోడ్డుమీద నడుస్తున్నారు. ఉరుములూ, మెరుపులతో వర్షం కుండపోతగా కురుస్తోంది. మెరుపు ఫెళ ఫెళమంటూ మెరిసి మాయమైపోగానే చీకటి వికృతంగా నవ్వుతోంది.

ఇలా ఎక్కడికి నడవాలి? ఎంతదూరం నడవాలి? తల దాచుకోవటానికి చోటెక్కడుంది? నడవకుండా ఇక్కడే నిలబడిపోతేనేం? నిలబడిపోవడంకంటె, నడిచిపోతేనేం? వాళ్ళకేమీ తోచటంలేదు. నడుస్తున్నారు. వర్షం ఆగేంతవరకు తడవక తప్పదు. వాళ్ళు పూర్తిగా తడిసిపోయారు. ఇద్దరూ శిలాప్రతిమల్లా వున్నారు. శిలా ప్రతిమకు శరీరం వస్త్రం వేరువేరుగా వుండవు. రెండూ ఏకంగానే వుంటాయి. వాళ్ళ బట్టలు శరీరాలకు అంటుకుపోయాయి. కాళ్ళకు బందాలు వేస్తున్నాయి. గాలి కొరడాదెబ్బల్లా ఛెళ్ళు ఛెళ్ళున వీస్తోంది. ఇద్దరూ ఊగిపోతున్నారు. వాళ్ళను ఎగరేసుకు పోతున్నట్లుగా ఓ గాలితెర వీచింది. గౌరి కాళ్ళు పైకి తేలిపోయాయి. ఆమె రెండు చేతులతో సుందరాన్ని గట్టిగా వాటేసుకుంది. అతడు తూలిపోబోయి, సత్తువనంతా కూడదీసుకుని నిలదొక్కుకున్నాడు. ఆమె అతనిమీదికి ఒరిగిపోయి నడుస్తోంది. ఆమె చేతులు అతని భుజాలమీద వున్నాయి, వర్షంలో ముడుచుకున్న విషసర్పాల్లా ఆమె వక్షోజాలు అతనికి రాచుకుంటున్నాయి.

సుందరం ఆ స్పర్శకు వణికిపోతున్నాడు ఆమె నిత్తులో అతనికి సహానంగా వుంది. ఆ శరీరం అతనికి భారంగా వుంది గౌరికి కండపుష్టి, రక్తపుష్టి ఎక్కువగా వున్నాయి. వివేకంమాత్రం అల్పంగా వుంది. కాముడు నెగళ్ళు ఎగదోస్తూ ఆమె శరీరంలో కూర్చున్నాడు. ఆమె శరీరం సలసల మరిగిపోతోంది. ఆమెమీద కురుస్తున్న వర్షం ఆవిరైపోతోంది.

కొంతదూరం నడిచిన తర్వాత, గౌరి అకస్మాత్తుగా ఆగిపోయింది సుందరం కదలలేకపోయాడు. 'పద్దు! నడుద్దాం! నడుస్తూనే వుందాం!' అన్నాడు.

'నేను నడవలేను!'

'ఇక్కడే మునిగిపోతాం గౌరీ! ఇది సముద్రం! ఒడ్డున పడదాం! ఈత కొడదాం! ఓపిక వున్నంతవరకూ ఈత కొడదాం!'

'నావల్లకాదు! నాకు ఓపికలేదా!'

అయ్యో, భగవంతుడా! ఇదేం పరిశోధన!

'నేను వెళ్తాను.'

గౌరి ఏడ్చింది. 'నీకు దయలేదు!'

సుందరం కాళ్ళు శిలలైపోయాయి. అతడు గజగజ వణికిపోతున్నాడు. ఇప్పుడేం చేయాలి?... ఏం చేయాలి?... దేవుడా! ఈ చీకట్లో నువ్వెక్కడున్నావు? నన్ను కాపాడు!...నాకు స్మృతి తప్పిపోనంటోందేమిటీ? నాకు మూర్ఛ రానంటోందేమిటీ?... నా ప్రాణం బొందిలోనుండి ఎగిరిపోయి, కాస్సేపు అలా షికారు తిరిగి రారాదూ?...

మెరుపు మెరిసింది!

ఆకులు రాలిన వెండుచెట్టులాంటి మెరుపు!

ఉడుకెత్తిన రక్తప్రసరణంలాంటి మెరుపు!

రోడ్డుప్రక్కనే—ఎండిపోయిన వాగు!

అదిగో, రైలుకట్ట!

వాగుకు దారి యిస్తూ—చిన్న రైలువంతెన!

'సుందర్! ఆ వంతెనకిందికెళ్ళిపోదాం, పద!'

'అది రాకాసిగుహలా వుంది. వొద్దు వొద్దు!'

గౌరి అతని జుట్టుమీద చేయిపుంచింది. 'ఏమిటీ మొండితనం? ఇలా వానలో తడిస్తే ఒళ్ళు ఏమవుతుంది? చెప్పినట్టు వినాలి!' అంటూ తల్లిలా మెత్తగా మందలించింది. అతనిచేతిని ఒడిసిపట్టుకుని వంతెనవైపు దారితీసింది. అతనికి తాను తప్ప వేరే తోడులేదన్నట్లు, అతన్ని కాపాడే బాధ్యత తనదన్నట్లు — అతన్ని జాగ్రత్తగా నడిపించింది. ఇంకా పాలుమానని చంటివాడిలా సుందరం ఆమెవెంట నడిచాడు.

ఇద్దరూ వంతెన క్రిందికి చేరుకున్నారు. రాతిగోడ వారగా ఇసుక మెట్టమీద నిలబడ్డారు. మెరపులు చీకటిని చీల్చివేస్తున్నాయి. చీకటి మెరపుల్ని మింగేస్తోంది. సుందరం పిచ్చివాడిలా నిలబడ్డాడు. చలికి అతని పళ్ళు కటకటలాడుతున్నాయి. ఒళ్ళు గగుర్పొడుస్తోంది.

గౌరి అతని ముఖంలో ముఖంపెట్టి చూచింది. 'చలిగా వుందా?' అంది అతను మాట్లాడలేదు.

ఆమె తన వోణీ తీసివేసి, మడిచి పిండివేసింది. ఎర్రటి జాకెట్టులో ఎత్తుగావున్న ఆమె వక్షస్థలం జిగేల్మంది. 'తల తుడిచివేస్తానుండు' అంటూ అతన్ని తన గుండెల మీదికి వాల్చుకుంది వోణీతో అతని తలను తుడిచింది. 'ఇక్కడెంత బాగుందో చూడు! వానలో తడద్దామంటావు నేనేం నిన్ను కొరుక్కుతింటానా? నేను నీ జోలికి రాను! తెల్లారేదాకా యిక్కడేవుందాం!' అంది

వానజల్లు ఆమె వీపును తాకింది. తుడుస్తున్న ఆమెచెయ్యి ఆగిపోయింది. అతన్ని మరింతగా హత్తుకుంటూ 'చలిపోయిందా?' అంది. ఆమె చేతిలోని వోణీ జారి క్రింద పడిపోయింది. ఆ చేతులు అతని జుట్టులోకి వెళ్ళాయి. అతని ముఖం మీద గబగబా ముద్దులు కురిపించిందామె. 'పాపం! నిన్ను చూస్తే నాకు జాలేస్తోంది! అంటూ అతని వీపుచుట్టూ చేతులువేసి గట్టిగా కౌగిలించుకొంది

సుందరం పెదవులు మాట్లాడలేక వణుకుతున్నాయి. అతని మాటలన్నీ రక్తంలోనే కరిగిపోతున్నాయి... ... గౌరీ! నిన్ను బతిమాలుకుంటాను. నన్ను ముట్టుకోకు! దూరంగా నిలబడు. నీ మెత్తటి వక్షోజాలు నా గుండెల్ని తొలిచేస్తున్నాయి వేడి ముద్దులు నన్ను కాల్చేస్తున్నాయి. నీ బిగి కౌగిలి నన్ను బందీ చేసేస్తోంది నీ చొరవ నామీద మంత్రం వేస్తోంది. నీ శ్వాస తాచుపాము బుసలా వుంది. నన్ను కాటు వేయకు మళ్ళీ! మట్టిలో కలసిపోయే ఈ శరీరాన్ని నేనెంతో భద్రంగా కాపాడుకుంటున్నాను. ఇది నాదికాదు. మరొకరిది. నా సుశీలది! దీనిపైన సర్వహక్కులూ ఆమెవే! ఆమె సొత్తును నువ్వు కాజేయటం తప్పుకదూ? నీ శరీరాన్ని చల్లార్చుకునేందుకు మరొకరి శరీరాన్ని కాల్చివేయడం న్యాయమా? అయ్యో, గౌరీ! ఇది తప్పు! మహాపాపం! ఈ పాపం నీకు తియ్యగా వుందా?... ...అతని గుండె ఏడ్చింది.

వంతెనలోపల పైభాగంలో సాలెగూటిలో ఈగ చిక్కుకుని, విలవిల తన్నుకుంటోంది. దానిచుట్టూ సాలెపురుగు సంతోషంతో నాట్యం చేస్తోంది.

ఆకలితో మేలుకున్న కామంలా వుంది గౌరి ఆమె శరీరం కొలిమిలా మండిపోతోంది. తన బలాన్నంతా-సుందరాని స్వాధీనం చేసుకోవడంలో కేంద్రీకరించింది దేవుడు ప్రార్థనకు వరమివ్వలేదు. ఆమె దేవుణ్ణి బలాత్కారిస్తోంది.

సుందరంలోని ధృఢత్వం చివరిసారిగా తలయెత్తింది... వీల్లేదు! గౌరిలాగ తానుకూడా కామానికి లొంగిపోకూడదు. గౌరికి దయ్యం పట్టింది. ఆ దయ్యాన్ని తరుముగొట్టాలి అతి ప్రయత్నం మీద అతని చేతులు పైకిలేచాయి అతడు ఆమె భుజాలు రెండూ పట్టుకున్నాడు. ఆమెను దూరంగా విసిరి పారేయాలనుకున్నాడు. అతనికి వేయి ఏనుగుల బలం వచ్చింది.

అతని చెంపమీద ఆమె పెదవులు చుంబిస్తున్నాయి.

అతని మనస్సులోని సుశీల కిలకిలా నవ్వింది!...ఆనకట్ట తలుపుల వద్ద సుళ్ళు తిరుగుతూ ఆగిపోయిన రక్తప్రవాహం మళ్ళీ హోరుమంటూ పైకిలేచింది. దారి వెతుక్కుంటూ ఆనకట్ట తలుపుల్ని చిల్లులు పొడిచింది. సుందరం కూడదీసుకున్న శక్తి అతనికే ఎదురు తిరిగింది గౌరి భుజాలమీద పడ్డ చేతులు ఆమెను తీగల్లా చుట్టివేశాయి

పరవశించిన భూదేవిలా, గౌరి నవ్వింది!

వర్షం! వర్షం!! వర్షం!!!

ఊపిరాడనివ్వని ధృతరాష్ట్రుడి కౌగిలిలాంటి వర్షం! కత్తిచేత బట్టుకుని పగవాణ్ణి తరుముకుపోయే ఉన్మత్తుడిలాంటి వర్షం! గడ్డపలుగుల్లా భూమిమీదికి దిగబడి, పాముల్లా నాలుకలు చాపుతూ ప్రాకుతూన్న వర్షం!

వర్షం వూగిపోతోంది. ప్రకృతిని వూపి పారేస్తోంది.

విద్యుత్తు బద్ధలై గుడ్డిగా పరుగులు తీస్తున్నట్టు ఆకాశం నిండా మెరుపులు! చల్లటి చేతి వేళ్ళలాంటి ఆ విద్యుల్లతాంతాల స్పర్శకు ప్రకృతి పులకించిపోతూ విరగబడి నవ్వుతోంది. ప్రకృతి సిగ్గు విడిచేసింది. చీర విప్పేసింది. దంతపు బొమ్మలా మెరిసిపోతూ నగ్నంగా నిలబడింది.

మేఘాలు రాక్షస మిధునంలా!ఒకదాన్నొకటి పెనవేసుకుంటూ పొర్లుతున్నాయి. ఆ చల్లని కౌగిలిలో తుపాకి గుండులా వేడి దూసుకుపోతోంది

ఆకాశం పెటేలుపోతూ ఓ మెరుపు మెరిసింది. ఫెళఫెళమంటూ ఎక్కడో పిడుగుపడి భూమి లోతుల్లోకి చొచ్చుకుపోయింది. నేల తియ్యగా మూలిగింది.

ఆకాశం క్రుంగిపోతున్నది. నేల పొంగిపోతున్నది.

పర్వత శిఖరాలమీదికి బరువుగా వాలిపోయిన వర్షామేఘం కరిగి, నీళ్ళై జారిపోతోంది. దాహంతో అలమటించిపోతున్న నేల తపనా తీర్చుకుంటోంది.

పొడుగాటి గూడ్సురైలులాంటి ధణధణమంటూ వంతెనమీద పరుగెడుతోంది.

(సశేషం)

# చెప్పవే ఎవ్వరని పిల్తు

శ్రీ యామిజాల పద్మనాభస్వామి

సచరాచరమ్మౌ విశ్వమ్మౌ నిమ్మగదాల్తు
క్షమయంచు పిల్తునా సామి ! నిన్ను,
స్ఫటిక ప్రభాపూర శైత్య ప్రభావమౌ
జలమంచు పిల్తునా సామి ! నిన్ను,
పరమారుణ ప్రభా పటలి భాసురధనం
జయుడంచు పిల్తునా సామి ! నిన్ను,
సుమ పరిమళ విభాసురమూర్తియౌ ప్రభం
జనుడంచు పిల్తునా సామి ! నిన్ను,
గగనమని పిల్తునా సామి ! విగుణదీప్తి
చరితులౌ రవి శశియంచు పిలుతునొక్కొ ?
పరమీవని పిల్తునా స్వామి ! నిన్ను
చెప్పవే ఎవ్వరని పిల్తు శ్రీనివాస !

౨

శీతలత్వ స్ఫూర్తి చెన్నారు జలధిమా ?
పరువంపు క్రొక్కారు మెఱుప ? నీవు
అంబరాంగణమునందసూక్ష్మతనువులై
భాసిల్లు చుక్కలా స్వామి ! నీవు,
మహనీయమైన ఆత్మజ్ఞానమున్ దెల్పు
విద్యయా నీవహో విశ్వనాథ !
విద్యకాకృతిని గల్పించు శబ్దము నీవు
గుణములన్ పోషించు గుణివ నీవు
సకల కల్యాణ గుణమహాస్థానమౌచు
పరమసులభుడవౌచు మా స్వామి యై

చెప్పవే వివ్వరనిపిల్తు

వెల్లతామరకంటివినా వేల్పులేడ ?
చెప్పవా ఎవ్వరని పిల్తు శ్రీనివాస !

౩

జాతిరత్న ప్రభాస్ఫార సుందరదేహా !
అరుణారుణ ప్రవాళాధరోష్ఠ !
వందారు జన దివ్య మందార పదపద్మ !
అంజనోపమ మనోహర శరీర !
శ్రీవత్స లాంఛనాంచితవక్ష ! బాలార్క
భాసమాన కిరీట ! వనజనయన !
శంఖచక్రాయుధోజ్జ్వలహస్త ! ఇందిరా
సౌభాగ్యవర్ధనా ! జలద వర్ణ !
శ్రీ ప్రభూ ! లోకపాలనోద్యోగ నిర్ని
మేష ! సంతోష కారణా ! భాష తెలిసి
ఏ మనుచు నిన్ను పిల్తునో యెరుగరాద
చెప్పవే దయచేసి; మా అప్ప కావ !

౪

కల్పాంతమున మాకవల్పమా సాహాయ్య
మిచ్చి ప్రేముడిని మమ్మేలువాడ !
ప్రతిఫలమ్మున కాసపడని శుద్ధుడవౌచు
ఆనందమూర్తివై అలరువాడ !
అపరంజియని పిల్తునా శ్రేష్ఠమైన మా
టికెం ముందున విగవిగలుగుల్కు
వజ్రమందున సత్ప్రభా భాసురంబైన
దీనమందున నిన్ను దేవదేవ !
అల సనాతన విశ్వమోహన విశిష్ట
సుందరాకారుడందునా ? సుందమతివి
ఏమనుచు పిల్వవలెనొకో విరుగనయ్య
చెప్పవే వివ్వరని పిల్తు శ్రీనివాస !

౫

అమలుడవని పిల్తునా అచ్యుతుడవంచు
పేర్కొందునా నిన్ను విశ్వనాథ !

భక్త సంసృతి రోగ భయహారి దివ్యౌష
ధం బందునా అమృతంబటంచు
పిల్తునా ఆజ్యమా విరి తేనెయా పక్వ
ఫలమ గోక్షీరమా పటికబెల్ల
మా షడసోపేతమా ప్రసాదంబంచు
చెప్పనా నీ పేరు శ్రీనివాస !
రూపమే లేక తేజస్స్వరూపమ్మైన
చక్రమంచును పిల్తునా స్వామి నిన్ను
ఏమనుచు పిల్వవలెనొక్కో విరుదనయ్య
చెప్పవే దయచేసి; మా అప్ప కావ!

౬

అలవిరించ్యాదుల కాదియౌ విను చతు
ర్వేదసారంబంచు పిల్వవలెనొ ?
విశ్వమోహనమ్మైన విమల గీతమ ! న్యాయ
సంప్రాపకమ్మైన శాస్త్రమనియ ?
వీని కన్నన్ మిన్నయై నిక్కమైనట్లు
దివ్యవస్తువటంచు తెలిసికొననా ?
అఖిలపుణ్యఫలమ్మటంచు పిల్తువ లేక
శ్రిత వత్సలుండైన కృష్ణుడనియ ?
ఆశ్రితామర మందార ! అఘవిదూర !
సచ్చిదానందరూప ! విజ్ఞానదీప !
ఏమనుచు నిన్ను పిల్వనో విరుదనయ్య !
చెప్పవే శ్రీనివాస ! మా అప్ప కావ !

౭

...వరని పిల్తు నిన్ను హృదయేశ్వర ! యందునా లోకరక్షణో
త్సవకర ! యందునా జగదుదాత్త పదాధిపతీ ! యటందువా ?

భువనకరా ! యటందున ! ప్రభూ ! ప్రియబాంధవ ! యంచు పిలుతునా
వివరముగాగచెప్పవొకో విశ్వవిధానపథానువర్తనా !

౧

స్తుతిపాత్ర ! రత్నభాసురగాత్ర ! నిను సృష్టి
కర్తయైని విరించిగా వచింతొ ?
అహికంకణుండైన తుహినాంశుమౌళి యం
చును పిలుతునా నిన్ను వన దవర్ణ !
ఈరేడులోకాల కేకాధిపతియౌచు
పాలించువాడ ! వన్నెలువాడ !
శ్రీ తులసీ దళాంచిత కంఠమాలికా !
అఖిలాంతరాత్మ ! ఏమనుచు పిలుతు ?
సకల పురుషార్థదాయి ! యీశా ! పరేశ !
భక్తపాలక ! మునిజనోపాస్యమాన
దైవమని నిన్ను పిలుతునా దాసబంధు !
చెప్పవే ఎవ్వరని పిలుతు శ్రీనివాస !

౨

పాలసంద్రమ్ముదచ్చి బంగారుబిందెతో
అమృతమిచ్చినవాడవనెదనయ్య !
కలుకురక్కసు గూల్చి ధరను కొమ్మునదాల్చి
నట్టి ఆదివరాహ మనెదనయ్య !
ఆదిశేషునిపై నొయ్యారమ్ముగా కూర్చు
వనజలోచనుడనుడవీవనెదనయ్య !
అవ్యయం బప్రమేయము వైభవము కల
ఆశ్రితామరభూజ మనెదనయ్య !
చేతనాచేతనంబైన సృష్టికెల్ల
తనువు జీవమునీవె యంచనెదనయ్య !
కాక ఏ మంచు నిను పిల్వగాగనౌనో
చెప్పవే శ్రీనివాస ! మా అప్ప కావ !

(ఆధారం : తిరువాయిమొళి-)

---

# అర్వాచీన తూర్పు గాంగరాజుల దేవేరులు

డా. సి. వి. రామచంద్రరావు

(గతసంచిక తరువాయి)

## కామార్ణవుడు (క్రీ.శ.1147–1156)

1) మాసమదేవి: శాలివాహనశక సంవత్సరములు చెరిగిపోయిన ఒక ముఖలింగ శాసనమున, మధుకేశ్వరునికి అఖండ దీప దానము గావించిన మాసమదేవి, 'కామార్ణవదేవ మహిషి' అని చెప్పబడ్డది.[25] ఈమెను గూర్చి ఇంతకన్న వివరములు తెలియరావు. విజయనగరం తాలూకా రెల్లివలస గ్రామమున లభ్యమైన శా. శ. 1075, అనంతవర్మదేవర (అనగా కామార్ణవుని) ఏనిమిదవ పరిపాలనావత్సరము నాటి ఒక శాసనమున 'రాచమరంది అరుసగొండలరావుత' అనువాడు, ఏరద విషయములో తాలండ పండ్రెండు వాటిలోని ఒక గ్రామమును "శ్రీ కామార్ణవ దేవ శ్రీ భుజవర్ధనంగా" వీరభద్రేశ్వర స్వామికి దానమిచ్చినాడు.[26] ఈ అరుసగొండలరావుత మాసమదేవి సోదరుడైన కావచ్చును. కామార్ణవుని ఇతర రాణుల పేర్లు శిలా శాసనములనుండిగాని, తామ్రపట్టికలనుండిగాని తెలియరావు.

## రాఘవుడు (క్రీ. శ. 1156–1170)

రాఘవుని దేవేరు లెవరో శిలాశాసనములనుండిగాని, తామ్ర శాసనములనుండిగాని ఎరుకరారు.

## ఇమ్మడి రాజరాజు (క్రీ. శ. 1170-1190)

1) సురమ: ఇమ్మడిరాజరాజు తమ్ముడైన ఇమ్మడి అనియంక భీముని కాలమునాటి ఒక భువనేశ్వర శిలా శాసనమున, స్వప్నేశ్వరుడనువాని సోదరి సురమాదేవి ఇమ్మడి రాజరాజభార్యగ పేర్కొనంబడినది.[27] ఈ స్వప్నేశ్వరుడు ఇమ్మడి రాజరాజునకు ఇమ్మడి అనియంక భీమునికి సైన్యాధ్యక్షుడై యున్నవాడు. స్వప్నేశ్వరుడు, సురమ అహిరముడనువాని బిడ్డలు. అహిరముని తండ్రి మూలదేవుడు. మూలదేవుని తండ్రి గౌతమ గోత్రజుడైన ద్వాందేవుడను రాజపుత్రుడు. ఇమ్మడి రాజరాజునకు వేరెవరైన దేవేరులు ఉన్న వారి పేర్లు తెలియరావు.

## ఇమ్మడి అనియంక భీముడు (క్రీ. శ. 1190-1198)

1) వాఘలదేవి: శిలా శాసనములలో ఇమ్మడి అనియంక భీముని రాణులెవ్వరును పేర్కొనబడలేదు. తామ్రపట్టికలలో పట్టమహిషియైన వాఘల్లదేవి వలన ఇతనికి ముమ్మడి రాజరాజు కలిగెనని చెప్పబడ్డది.[28]

## ముమ్మడి రాజరాజు (క్రీ. శ. 1198-1211)

1) మంకుణ దేవి: చాళుక్యకుల సంభూత, వేలాసింధువారిధి అయిన మంకుణదేవి ముమ్మడి రాజరాజువలన ముమ్మడి అనియంక భీముని బడసెనని తామ్రపట్టికలు చెప్పుచున్నవి.[29]

# ముమ్మడి అనియంక భీముడు

## (క్రీ. శ. 1211-1238)

1) సోమలదేవి : మహారాజాధిరాజ రాజపరమేశ్వర అనంత వర్మ రాహుతదేవ బిరుదాంకితుడైన (ముమ్మడి) అనియంక భీముని 19 వ పాలనావత్సరమునాటి (క్రీ.శ. 1230) కాంచీ శిలాశాసనము అతని దేవేరి సోమలదేవిని పేర్కొనుచున్నది[30] ఈ శాసనమున సోమలదేవి వారణాసి కటకము (అనగా నేటి కటక్) నుండి, అంతరుద విషయము (నేటి అంతరోధ్ పరగణా, పూరిజిల్లా) నందలి ఉదయ కామ గ్రామమును కంచి అల్లాల నాథపెరుమాళ్ల పూజా పునస్కారములకై దానమిచ్చునట్లు తెలుపబడ్డది. డి. సి. సర్కార్ ఈమె ముమ్మడి రాజరాజ చోళుని (క్రీ. శ. 1216 – 1246) కుమార్తెయై ఉండవచ్చునని సూచించిరి[31] హొయసల చక్రవర్తి ఇమ్మడి నరసింహునికి సోమలదేవి అను రాణివలన ఒక పుత్రిక గలదు. ఆమెను ముమ్మడి రాజరాజచోళుడు పెండ్లాడినాడు. వారికి గలిగిన సంతానమే ముమ్మడి అనియంకభీముని దేవేరి సోమల అని సర్కారుగారు సూచించినారు. ముమ్మడి రాజరాజచోళుని దేవేరి పుత్రికకు తన తల్లి పేరు పెట్టియుండవచ్చును. ఈ సందర్భమున ఒక విషయము సూచించవలసియున్నది. ముమ్మడి రాజరాజచోళుడు (క్రీ. శ. 1216 –1246) సత్త్వహీనుడు. క్రీ. శ. 1223 ప్రాంతమున ముమ్మడి అనియంకభీముని బడ్డెమూకలు చోళరాజ్యమును ప్రవేశించి, శ్రీరంగమువరకు నడచెను. శ్రీరంగములోని శాసనములలో 'బడ్డెల గలభా'కు సంబంధించిన ప్రస్తావము కలదు. ఈ బడ్డెమూకలు క్రీ. శ. 1225 వరకు చోళరాజ్యముననే ఉండెను. అనియంక భీముని దక్షిణదేశ దండయాత్రను గురించి మనకు పూర్తివివరములు తెలియవచ్చుటలేదు. దీనిని గురించి ఇంకను పరిశోధన జరుగవలసి యున్నది. అనియంకభీముడు (లేక అతని మూకలు) తన దక్షిణదేశ దండయాత్రలో క్రీ. శ. 1225 ప్రాంతమున ముమ్మడి రాజరాజ చోళుని నిర్జించి, అతని పుత్రిక యైన సోమలదేవిని, యుద్ధపరిహార ముగా, దేవేరిగా స్వీకరించెనని నేను భావించుచున్నాను. ఏలనన, కాంచీపురమున పైన కనుపరచిన క్రీ. శ. 1230 నాటి సోమలదేవి శాసనమేగాక, క్రీ. శ 1235 నాటి అనియంకభీముని మరియొక శాసనము కూడ కలదు.[32] ఈ శాసనమున, కళింగేశ్వరుడైన అనియంకభీముడు అల్లాలనాథదేవుని నాలు నిత్యదీపములు పెట్టుటకై 128 ఆవులను, 4 ఎద్దులను దానము చేసెనని చెప్పబడినది ఇట్లు క్రీ. శ. 1230న అని యంకభీముని దేవేరియైన చోళరాజపుత్రి సోమలదేవి, క్రీ. శ. 1235న అనియంకభీముడు కాంచీపుర దేవాలయమునకు దానధర్మములు గావించుట, అని యంకభీమునికి క్రీ. శ. 1225 ప్రాంతమున దక్షిణదేశ దండయాత్రలో చోళులతో కలిగిన వివాహ సంబంధము వలననే యని నేను భావించుచున్నాను[33] పైన, అనంతవర్మ చోడగంగుని దేవేరి సోమలదేవి నామధేయం కలదనియు, ఆమె తూర్పుచాళుక్య రాజరాజనరేంద్రునికి రేవలదేవి వలన కలిగిన కుమార్తె సోమలదేవికి దౌహిత్రియై యుండవచ్చుననియు చెప్పి యుంటిమి. ఈ "సోమల" అను పేరుచాళుక్య, చోళ, హొయసల వంశములలో తరచు కానవచ్చు పేరైయున్నది.

2) కస్తూరీదేవి : తామ్రపట్టికలలో ముమ్మడి అనియంక భీమునికి కస్తూరీదేవివలన (మొదటి) నరసింహుడు కలిగెనని చెప్పబడినది.[34] ఈమెను గూర్చి ఇతర వివరములు తెలియరావు.

3) గంగాదేవి : వీరశ్రీ నరసింహరావుత దేవర (మొదటి నరసింహుని) 22 వ పాలనా వత్సరమునాటి ఒక సింహాచల శాసనమున ఈమె "అనియంక భీమదేవరల గంగామహాదేవి" అని చెప్పబడినది.[35]

# మొదటి నరసింహుడు (క్రీ. శ. 1238-1263)

1) సీతాదేవి : ఈమె పేరు శిలాశాసనములలో కానరాదు శిలా శాసనములు మొదటి నరసింహుని రాణుల నెవ్వరిని పేర్కొని యుండలేదు. తామ్రశాసనములలో సీతాదేవి మూలచంద్రుని కుమార్తె యనియు, మొదటి నరసింహుని భార్యయనియు, మొదటి భానుదేవుని తల్లి అనియు చెప్పబడినది.[36] సీతాదేవి తండ్రియైన మూలచంద్రు డెవరో తెలియరాదు.

# మొదటి భానుదేవుడు (క్రీ. శ 1263 1278)

1) అన్నమాంబ : శాలివాహన శకము, 1196 (క్రీ శ. 1274) నాటి ఒక ద్రాక్షారామ సంస్కృత శిలాశాసనమున అన్న

న్నాంబ తాను "గజఘటాపతీ వీరభాను పట్టా...మహిషీ' అని చెప్పుకొని యున్నది.[37] ఈమె శాసనమున తన తండ్రిపేరు కూడ చెప్పుకొన్నది; కాని, ఆ భాగము పూర్తిగా చెరగిపోయినది. ' ఈమె పేరున గూడా ఒక అక్షరము చెరగిపోయి, "గజఘటాపతీ వీరభాను పట్టా...మహిషీ •సద-మాంబా" అని ఉన్నది. ఈ లోపించిన అక్షరము ' న్న" గా భావించడమైనది. ఈమె ద్రాక్షారామ భీమేశ్వరుని భోగార్థమై సంతతొండి విషయమున 30ఖండుకములనేల, దేవాలయమునకు లేక ద్రాక్షారామమునకు తూర్పు చివరగల తోపున నందనము ననుకరించు ఉద్యానవనము. దానిమధ్య "చోడమంటప"మను పేర ఒక మండపము కట్టించినది. తాను గజపతి అమరాగమునకు పాత్రమైన సుపుత్ర, పౌత్రవతినని చెప్పుకొన్నది. తాను కట్టించిన మండ 'పమునకు" చోడమండప"మని పేరిడుటచే ఈమె చోడ లేక చోళ రాకుమార్తెయై యుండనోపు కాని దీనికి ప్రతిబంధకముగా శాసనము చివర, "తే పరిపాలయన్ తు చాలుక్య ధర్మనం భువి భావిభూపాః' అని చెప్పియుండుటచే, ఈమె చాలుక్య వంశజ అని గూడ సంశయము కలుగుచున్నది. విజ్ఞుల పరిశీలనకై శాసన భాగము నిందు పొందుపరచుచున్నాను: "త్రింశత్ఖండుక సంమితా మపి మహీం శ్రీ వీరభానోర్మహాదేవీ సంతతొండి విషయే ప్రాదాజ్జగన్మంగల।| [౨] భీమనాథపుర పూర్వ దిక్తటి తోంపు మధ్యగత చోడ మంటపం। నందనం నవమకారి కోమలై భగాన్రుహై రిహ తయా మనోరమై।। [౪] రాగాతిరేక సంగత గజపతి భానోస్సుపుత్ర పౌత్రవతీ [1] సా పట్టమహాదేవి జీయాత్సౌభాగ్య భాగ్యవతీ| [౫| శ్రీ వీరభాను దేవ్యై తవనిధి మద్యుత్సన [స్య] హృదిముదితా| ఆత్మానురూప నిశ్చల సౌభాగ్యం పార్వతి దద్యాత్| [౬] నిధాయ మూల్యం విధివత్ క్రమేణ సుమల్లభాగాబత్సున్ రియు ధరిత్రీ| యదా జిన్తాస్ తే పరిపాలయన్ తు చాలుక్య ధర్మన్సం భువి భావి భూపాః| [౭]

2) జాకల్లదేవి: తామ్రశాసనములలో చాలుక్య వంశ సంభూత యగు జాకల్లదేవికి మొదటి భానుదేవుని వలన ఇమ్మడి నరసింహు డుదయించెనని చెప్పబడినది [38]

## ఇమ్మడి నరసింహుడు [క్రీ.శ.1278-1305]

1) చోడమహాదేవి : తామ్రశాసనములలో ఇమ్మడి నరసింహునికి చోడమహాదేవివలన ఇమ్మడి భానుదేవు డుదయించెనని చెప్ప బడినది. [39]

## ఇమ్మడి భానుదేవుడు [క్రీ. శ.1305-1327]

1) లక్ష్మీదేవి : ఈమెకు ఇమ్మడి భానుదేవునివలన ముమ్మడి నరసింహు డుదయించెనని తామ్రశాసనములు చెప్పుచున్నవి.[40]

## ముమ్మడి నరసింహుడు

## [క్రీ. శ. 1327-1353]

1) గంగాదేవి : శ్రీ కూర్మం, సింహాచలం, శ్రీకాకుళం (కృష్ణాజిల్లా)—ఈ చోట్లగల వైష్ణవ దేవస్థానములలో గంగాదేవి ఆ యా దేవతల పూజా పునస్కారములకు, నిత్యసేవలకు దాన ధర్మములు గావించి వేయించిన శాసనములు. శా. శ. 1265 (క్రీ. శ. 1343)నుండి శా. శ. 1275 ( క్రీ. శ. 1353) వరకు, చాల గలవు. [41] ఈమె శాసనములు వైష్ణవ దేవస్థానములకే పరిమితమగుటచే ఈమె వైష్ణవ మతావలంబి అయియుండవచ్చును. ఒక శాసనమున ఈమె "పతివ్రతా, ధర్మవతీ, హరేర్భక్తి సమన్వితా" అని వర్ణింపబడినది.[42] "శ్రీ వీరాదివీర నరనారసింహ్య దేవ" (ముమ్మడి నరసింహుని) 28 వ విజయరాజ్య సంవత్సరమునాటి ఒక శ్రీ కూర్మ శాసనమున, ఈమె సీతాదేవి అను నామెతో కలసి దేవునికి కొన్ని సేవలకై ఏర్పాటు గావించినది.[43] ఈ శాసనమున గంగాదేవికి, సీతాదేవికి, నరసింహునితోగల సంబంధ బాంధవ్యములు తెలుపబడలేదు. నరసింహునికి కొమ్మిదేవియను మరియొక దేవేరి కలదు.[44] శ్రీ కూర్మమందలి యొక శాసనమున సీతాదేవిని తన కూతురుగా కొమ్మిదేవి పేర్కొని యున్నది.[45] ఈ శాసనమున గంగాదేవికూడా పేర్కొనబడియున్నది.

శా. శ. 1271 నాటి సింహాచల శాసనమొకటి "వీరవర సింహదేవరాజుల మహాదేవి గంగామహాదేవి" ని అప్పరాజు తనయగా చెప్పియున్నది [46] ఆమెను గూర్చి శాసన సంస్కృత భాగమున ఇట్లున్నది ! ' వీర శ్రీమత్ప్రతాప క్షితి పతి తిలక శ్రీ పతేస్సుల్య

కీర్త్రివ్యాప్తో రుద్రతాప స్సకల గుణనిధిర్దాన శౌండశ్చకాస్తి॥ రాజ్ఞీవర్యా రమేవ ప్రకటిత మహిమా వల్లభా అస్య సాధ్వీ గంగాదేవీ గుణాఢ్యా జలనిధి సదృశస్యాప్పరాజస్య పుత్రీ॥". జలనిధి సదృశుడైన ఈ అప్పరాజు ఎవరో తెలియదు. శా. శ. 1272 నాటి ఒక సింహాచల శాసనమున ఈమె సూర్యవంశ సముద్భూతగ చెప్పబడినది.[47] శాసన సంస్కృత భాగమున నిట్లున్నది: 'శ్రీసుతు గంగాన్వయే సువిమల చరితే సూర్యవంశ ప్రకాశే వీరక్ష్మాపో నృసింహో వని పతి మణి ... ... ... శ్రీ వాజీ వల్లభస్య ప్రకటిత యశస్తస్య రాజ్ఞీ వదాన్యా దేవీ గంగాభిధానా మనపతి దయితా సన్నిధానాత్ గుణాఢ్యా" ఈ శాసనముద్వారా, దేవుని కీమె "గంగా నరసింహ భోగ" మను కైంకర్యము ప్రతిష్ఠించి, ఆ సేవ జరుగుబాటుకై, "కళింగ్గ దేశ మందున ఎరద విషయానకుతాం డంగి ప్రోలపాల పిన్నకెల్ల కరటము వెంగాల వెంటి గారపల్లి" అను ఆరు గ్రామములు సమర్పించినది. శా. శ. 1274 లో ఈమె (నృసింహ నృపతే రర్ధాంగ లక్ష్మీ ర్ముదా గంగ్గాంబా") కూర్మేశ్వరునకు కొన్ని అభరణముల సమర్పించినది[48] శా. శ. 1275 లో గంగాదేవి తాను ప్రతిష్ఠించిన గంగానరసింహ భోగమను కైంకర్య నిమిత్తమున పురాణ పఠనకై ఏర్పాటు గావించినది[49] అదే వత్సరమున కాళిదాస సేనాపతి, గోపాలజియ్య, గోవింద సేనాపతులను అధికారులద్వారా శ్రీ కాకొలను (శ్రీకాకుళం, కృష్ణా జిల్లా) వల్లభరాయనికి, ఆభరణ, ఛత్ర, చామరాది ఉత్తమ వస్తుజాలమును కానుకలంపినది.[50]. గంగాదేవి శాసనములు ఇన్ని లభ్యమగుచున్నను, ఈమె సూర్యవంశమునకు చెందిన అప్పరాజు అనువాని కూతురని తప్ప వేరు వివరము లేవియు తెలియవు.

2) కొమ్మిదేవి: శా. శ. 1263 నాటి ఒక శ్రీ కూర్మ శాసనమున ఈ కొమ్మిదేవి, "తన కూంతురైన సీతాదేవికి పుణ్యముగాను" శ్రీ కూర్మనాథునికి కొన్ని గోవులను, ఆభరణములను, దీపస్తంభమును ధర్మము కావించినది.[51] ఈ శాసనము నరసింహునిగాని, నరసింహునితో కొమ్మిదేవికిగల సంబంధమునుగాని పేర్కొనదు. ఇదే శాసనమున, గంగాదేవి శ్రీకూర్మనాథుని "నామ సంకీర్తనమునకుగా" ఏర్పాటు గావించినది. సీతాదేవి గంగాదేవితో కలసి, శ్రీ కూర్మముననే, వేరొక శాసన మూలమున, కొన్ని సేవ లర్పించినదని పైన తెలిపియుంటిమి. దీనినిబట్టి సమన్వయము చేయగా,

ఈ కొమ్మిదేవి నరసింహుని మరియొక దేవేరి యని తోచుచున్నది. ఈమెదే శా. శ 1271, "వీరాదివీర నరనారసింహ్య దేవ విజయ రాజ్య సంవత్సరంబులు 28' నాటి శ్రీ కూర్మ శాసనమొకటి కలదు.[52] ఈ శాసనమునగూడా కొమ్మిదేవికి నరసింహునికిగల సంబంధము తెలుపబడలేదు.

3) బిరుజాదేవి: శా. శ. 1305, నాల్మడి నరసింహుని (క్రీ శ 1378–1409) నాటి, ఒక సింహాచల శాసనమున బిరుజాదేవి "గజపతి పెదనరసింహ్య దేవరాజుల మహాదేవి" గా పేర్కొనబడినది [53] ఈ పెదనరసింహరాజు ముమ్మడి నరసింహుడుగా గుర్తింప బడినాడు [54] ఈ శాసనమున ఈమె "శ్రీ వీర భానుదేవరాజుల" (అనగా ముమ్మడి భానుదేవుని) 'మహాదేవి తారాదేవి'తో కలసి సింహాచలస్వామికి రెండు వింజామరలు సమర్పించినది. బిరుజాదేవి, తన భర్త ముమ్మడి నరసింహుడు గతించిన తర్వాత, మనమడైన నాల్మడి నరసింహుని కాలము వరకు జీవించియున్నట్లు ఈ శాసనమువలన తెలియును.

4) కమలాదేవి: తాను శాసనములలో నరసింహునికి కమలాదేవి నందు (ముమ్మడి) భానుదేవుడు కలిగెనని చెప్పబడియున్నది [55]

## ముమ్మడి భానుదేవుడు

### [క్రీ శ. 1353-1378]

1) తారాదేవి: శా. శ. 1305, నాల్మడి నరసింహుని (క్రీ శ 1378 1409) నాటి, ఒక సింహాచల శాసనమున ఈమె 'శ్రీ వీరభాను దేవరాజుల మహాదేవి తారాదేవి' అని చెప్పబడినది [56] ఈమె ముమ్మడి నరసింహుని దేవేరియైన బిరుజాదేవితో కలసి, సింహాద్రి నాథునికి రెండు వింజామరలు సమర్పణ చేసినదని పైన చెప్పితిమి.

2) హీరాదేవి: తామ శాసనములలో చాళుక్యవంశ సంభూత యగు హీరాదేవికి, (ముమ్మడి) భానుదేవునివలన, (నాల్మడి) నరసింహుడుదయించెనని చెప్పబడినది [57]

## నాల్మడి నరసింహుడు [క్రీ.శ.1378-1409]

1) తారాదేవి: శా. శ. 1305 నాటి ఒక సింహాచల శాసనము, సంస్కృతమున, "తారాదేవీ నృసింహ్యక్షితిపతి తిలకస్య ప్రేమాన్య భార్యా" అనియు తెలుగున, "గజపతి వీరసింహ్యదేవని పట్టమహాదేవి తారాదేవి" అని చెప్పియున్నది.[58] పైన, శా. శ. 1305 నాటి ఒక సింహాచల శాసనము (ముమ్మడి) భానుదేవుని దేవేరి 'తారాదేవి' నొకతెను పేర్కొని యున్నదని చెప్పితిమి. ఈ 'తారాదేవి' నామధేయ లిద్దఱు వేర్వేరు వ్యక్తులనుకొనవలయును భానుదేవుని భార్య తారాదేవిని పేర్కొన్న శాసనము శా శ 1305, చైత్ర కృష్ణషష్ఠి బుధవారమునాటిది. నరసింహుని పట్టమహాదేవి తారాదేవిని పేర్కొన్న శాసనము శా శ 1305, చైత్ర కృష్ణ అష్టమి, గురువారము నాటిది అనగా ఈరెండు శాసనముల మధ్య రెండురోజుల ఎడము కలదు. ఈ తారాదేవులిద్దరు వేర్వేరు వ్యక్తులని భావించుటే సమంజసము. వీరినిగూర్చి ఇతర వివరము లేవియు తెలియకపోవుట దురదృష్టము.

2) ఉత్తమ దేవి: ఈమెకు సంబంధించిన శాసనములు రెండు సింహాచలమున గలవు.[59]

శా శ. 1316 నాటి రెండు శాసనములు ఈమెను (నాల్మడి) నరసింహుని భార్యగా పేర్కొనుచున్నవి. మొదటి శాసనమున ఈమె "ప్రతాపవీర నృసింహ దేవరాజుల మహాదేవి ఉత్తమాదేవి" అని పేర్కొనబడినది.[60] శాసన సంస్కృత భాగమున "నృసింహ్య క్షితిపతి రమణీ దేవయోషిత్ సముదాత్ ఉత్తమదేవి సంజ్ఞా సకల గుణవతి' అని వర్ణింప బడినది" ఈ శాసనముద్వారా, "ఉత్తమదేవి మహాభోగము" అను కైంకర్యము ప్రతిష్ఠించి, శ్రీ నరసింహ్యనాథునికి నిత్యమున్ను ... ... ఒక అవసరము ఆరగింపను .. ... పినగాండి ఊరు...(కయముగాని" సమర్పించినది. రెండవ శాసనమున ఈమె "ప్రతాపవీర నృసింహ్య దేవరాజుల మహాదేవి ఉత్తమదేవి మహాదేవి" అని పేర్కొనబడినది.[61]

శా. శ. 1316నాటి మరియొక శాసనము ఉత్తమదేవి తల్లి పేరు చింగా ముదువలియని, మాతులుని పేరు తమ్మన జియ్యన అని తెలుపును [62] ఈ తమ్మన జీయనను గూర్చి శాసనము ఇట్లు చెప్పుచున్నది. "శ్రీ నరసింహదేవదయితో దేవ్య (వ్యా?) త్తమామాతులః శ్రీ వత్సాన్వయ పశలాదు వరదాచార్యాత్మజః శ్రీనిధిః| శ్రీ చింగాముదు వ్వలతి ప్రియతర భ్రాతాచ తాళాంబుధిర్ధీమాన్ త(ం)మ్మన జియ్యన ప్రభువరో జీయాచ్చిరం భూతలే" తెలుగున "[భంటా]

త... శేఖ .శీత (ం) మ్మన జీయ్యన" అని పేర్కొనబడినాడు. "భంటాత...లేఖ', బహుశా భండారలేఖ కావచ్చును. ఇచట తమ్మన జీయన, ఉత్తమదేవి తల్లి చింగాముదుసలికి ప్రియతర భ్రాతగా చెప్ప బడినాడు తమ్మన జీయన. చింగారెడి ముదుసలుల తండ్రి, అనగా ఉత్తమదేవి మాతామహుడు, శివత్స గోత్రుడైన వళలారు వరదా చార్యుడు గోత్రమునుబట్టి, ఆచార్య సంకేతమునుబట్టి ఈ వరదా చార్యుడు వైష్ణవ బ్రాహ్మణుడు అనుకొనవలెను. ఇట్లు తల్లివైపు ఉత్తమదేవి బ్రాహ్మణవంశ సంజాతగా కన్పట్టుచున్నది. శా. శ, 1316 నాటిదే, వేరొక శాసనమున తమ్మన జీయనభార్య "తల్లను నాయకాళ' అని పేర్కొనబడియున్నది [63] శా. శ. 1313 నాటి ఒకశాసనమున "...ంతాబుడా ఇలేంక శ్రీ తమ్మన జీయ్యన" పేర్కొన బడియున్నాడు [64] ఇతడు ఉత్తమదేవి మాతులుడైన తమ్మన జీయన అనుకొనవలయును. "...ంతా బుడా ఇలేంక" ఒక అధికారమును సూచించు పదముగా నున్నది.

శా. శ. 1316 నాటిదే వేరొక శాసనమున, ఉత్తమదేవి తల్లి చింగారెడ్డి ముదుసలి, "అర్జునరెడ్డి సింగాముదుసలి" అని పేర్కొనబడి, ఉత్తమదేవి ప్రతిష్ఠించిన "ఉత్తమదేవి మహాభోగ" మను సేవకు, తాను నిత్యము ఒక కుండెడు పెరుగు సమర్పించు ఏర్పాటు కావించినది. [65] ఈ శాసనమున "వళలారు తమ్మయంగారు" "తమ ఆచార్యుండ"ని సింగాముదుసలి పేర్కొనినది. ఈ వళలారు తమ్మయ్య, ఆమెసోదరుడైన తమ్మన జీయనయా, లేక వేరొక వ్యక్తియా అని నిర్ణయించుటకు ఆధారములులేవు. 'అర్జునరెడ్డి సింగాముదుసలి" అని సింగా ముదుసలి పేర్కొనబడుటలో, ఈ అర్జునరెడ్డి అనువాడు ఆమె భర్త అని ఊహించవలసియున్నది రెడ్డి అనుపదము నాల్గవ జాతిని సూచించును. ఇదే నిజమైన పక్ష మున ఉత్తమదేవి శూద్రునకు, బ్రాహ్మణ స్త్రీకి జరిగిన ప్రతిలోమ సంబంధమున కలిగినదని తలచవలసి యున్నది. శా. శ. 1318నాటి ఒక శాసనమున 'అర్జుని జీయ్యన' అనువాడు "ఉత్తమమహాదేవి భోగము"న, దేవునికి వింజామరలు వీచుటకై ఏర్పాటు గావించి నాడు [66] ఈ అర్జున జీయ్యన "భోగపరీక్ష" అనగా దేవునికి జరుగవలసిన సేవలను అమలుపరచవలసిన అధికారిగా చెప్పబడినాడు. ఈ అర్జునజీయ్యనే అర్జునరెడ్డి కావచ్చును శా. శ. 1323 నాటి మరియొక శాసనమున 'ఉత్తమ మహాదేవి తల్లి చింగా ముదుసలింగారు" పేర్కొనబడి యున్నది. [67]

ఈ శాసనమున ఈమె "శ్రీ మహాదేవిభోగము" అనగా ఉత్తమ మహాదేవి భోగమునకై, దేవుని "మడపలి" అనగా వంటసాలకుగాను 10 పుట్ల నేల సమర్పించినది.

3) <u>పార్వతీదేవి :</u> శా. శ. 1328 నాటి ఒక సింహాచల శాసనము ముమ్మడ నామాంతరయగు పార్వతీదేవిని, శాసన తెలుగు భాగమున "ప్రతాప వీరనరసింహ్వ దేవమహారాజుల మహాదేవులైన విర్ఘుల జీయ్యనంగారి కూతులు పార్వ్వతి మహాదేవింగారు" అని, సంస్కృత భాగమున "గుణగణనిలయా విజ్జినేశస్య పుత్రీ స్వస్యాశ్చా బీష్టస్య సిద్ధ్యై గజపతి దయితా పార్వతి ముంమడాఖ్యాం" అనియు పేర్కొనినది.[68] పార్వతీదేవి తండ్రిగా పేర్కొనబడిన విర్ఘుల జీయన లేక విజ్జినేశుని గూర్చి ఎట్టి వివరములు తెలియరావు. పార్వతీదేవి, ప్రభుత్వమునుండి 6 గ్రామములుకొని దేవునికి సమర్పించి నది. ఈ విషయమును శాసనము ఇట్లు నుడువుచున్నది. "పార్వ్వతి మహాదేవింగారు తమకు అభీష్టార్థ సిద్ధిగాను భోగానకై కటక భండారమందు మలలు 300 మాళ ప్రవేశముచేశి రజుల శ్రీ హస్త పాత్ర ప్రమాణమందున్ను కళింగదేశమందును అనకపల్లి నావులపల్లి సిశినికవాడ ఏడువాక నాడుమను ముమ్మడివాడ క్రయంగా విలిచి సింహ్వాద్రి నా(ం) ధనికి సమప్పిరించెను."

4) <u>కమలాదేవి :</u> శా. శ. 1326 నాటి ఒక సింహాచల శాసనమున కమలాదేవి నాల్మడి భానుదేవుని (<u>క్రి.శ. 1409-1434</u>) పినతల్లిగా చెప్పబడివున్నది. [69] శాసన సంస్కృత భాగమున ఈమె 'జియ్య గజపతి జననీ కమలాదేవీ" అని తల్లిగానే పేర్కొనబడి నప్పటికి, తెలుగుభాగమున "గజపతి ప్రతాపవీర నిరంక్క భాను దేవ రాజుల పినతల్లి కమలాదేవి అమ్మజీయ్యంగారు" అని వివరింపబడినది.

నాల్మడి భానుదేవుని తామ్రశాసనములేవియు నేటికి లభ్యము కాకపోవుటచేతను, పైన పేర్కొనిన నాల్మడి నరసింహుని రాణులలో నాల్మడి భానుదేవుని తల్లి ఎవరో చెప్పవీలుకాదు బహుశా నాల్మడి భానుదేవుడు తారాదేవిపుత్రుడైయుండవచ్చును; ఏలనన, ఈమె శిలాశాసనములందు పట్టదేవిగా పేర్కొనబడినది.

## నాల్మడి భానుదేవుడు

**[క్రీ శ. 1409 1434]**

శిలా శాసనముల నల్మడి భానుదేవుని నల్గురు దేవేరుల

పేర్లను తెలుపుచున్నవి ఈ శాసనము లన్నియు సింహాచలమున లభ్యము లైనవి.

1) రాజలదేవి లేక రాజాదేవి:

శా. శ. 1336 నాటి ఒక శాసనము ఈమెను "గజపతి ప్రతాపవీర శ్రీ నిశంక భాణుదేవరజుల మహాదేవి రజుల దేవి మహాదేవి" అని పేర్కొన్నది [70]

2) తల్లమదేవి : ఈమె శా. శ 1344నాటి ఒక శాసనమున వారణాసి కటకము (నేటి కటక్)నుండి, దేవుని నిత్య తిరుమంజనము (అభిషేకము)నకు ఏర్పాటు గావించినది. [71] శాసన సంస్కృత భాగమున "భానుదేవ గజాధీశ మహాదేవ్యాహ్వా తల్లమా" అని, తెలుగున, "వీర శ్రీ నిశంక భాణుదేవరాజుల మహాదేవి తల్లమా దేవి మహాదేవి" అని పేర్కొనబడినది

3) ఎల్లమదేవి : శా. శ. 1349 నాటి ఒక శాసనమున, ఈమె "నిశంక భాణుదేవ రాజుల మహాదేవి ఎల్లమాదేవి" అని చెప్పబడినది [72]

4) చోండ మహాదేవి శా. శ 1352 నాటి ఒక శాసనము "నిశంక భాణుదేవరాజుల మహాదేవి చోండ (మా) దేవి మహాదేవి"ని పేర్కొనుచున్నది.

నాల్మడి భాను దేవుని పై దేవేరుల గూర్చిన ఇతర వివరము లేవియు తెలియరావు.

అర్వాచీన తూర్పు గాంగరాజుల దేవేరులను గూర్చిన వివరము లనేకము భావిపరిశోధన వలన ఎరుగవలసి యున్నది. వీరిలో చాల మంది ప్రసిద్ధ రాజవంశములకు చెందినవారుగాక సామాన్య వనితలుగ కన్పట్టుచున్నారు. చాలమటుకు, రాజులు తమ కలిమి బలముల చేకూర్పుకై ప్రసిద్ధ రాజవంశములకు చెందిన రాజకన్యలను వివాహమాడుట సంప్రదాయము; యుద్ధమునందోడిన రాజుల కుమార్తెలను, ఒక విధమైన నష్ట పరిహారముగ, వారి రూప గుణాతిశయములనుబట్టి, ఉద్వాహమాడు ఆచారముగూడ కలదు. గాంగరాజుల వివాహములు చాలమటుకు ఈ సంప్రదాయములకు విరుద్ధముగ నున్నవి. పట్టపు దేవులని చెప్పబడినవారి విషయమునగూడ, వారి వంశాదికమును గూర్చిన, వారి తలితండ్రులగూర్చిన వివరములు చెప్పబడియుండలేదు. వీరిలో కొంతమంది తమ తల్లుల పేర్లు తప్ప తండ్రుల పేర్లు చెప్పలేదు వీరిలో క్షత్రియ కన్యలేగాక, బ్రాహ్మణ, శూద్రాది ఇతర వర్ణములకు చెందిన వారుగూడ ఉండినట్లు తెలియుచున్నది. దీనినిబట్టి నాడు సంఘమున, అనులోమ ప్రతిలోమ వివాహములుగూడ ఆమోద యోగ్యము లైనటు తెలచవలెను.

ఈ వ్యాసమున, శాసనములనుండి, నేటికి తెలియవచ్చినంత వరకు, అర్వాచీన తూర్పు గాంగరాజుల దేవేరులను గూర్చి, సమగ్రముగా తెలియ చేయుటకు ప్రయత్నము జరిగినది. భావికాలమున బయల్పడగల శాసనముల వలన వీరినిగూర్చి ఇతోధిక వివరణముల కవకాశము కలుగవచ్చును.

## అధోజ్ఞాపికలు

25 ద. హిం. శా V. 1047

26 ద. హిం. శా X. 707.

27 ఎపి. ఇండికా VI, పు. 198 మొ||

28 ఎపి. ఇండికా. XXXI పు 249-262 లు.

29 అదే.

30 ఎపి. ఇండికా, XXXI, పు. 94-98 లు.

31 ఎపి. ఇండికా, XXXI, పు. 99-102 లు.

32 ఎపి ఇండికా, XXXI, పు. 94-98.

33 దక్షిణ దేశముపై ఈ బడ్డె దండయాత్ర, అనియంక భీము, సోమల దేవీ వివాహ బాంధవ్యము, వీనినిగూర్చిన చర్చలకై చూడు. నేలటూరి వెంకటరమణయ్యగారి వ్యాసములు, భారతి, 1945, ఫిబ్రవరి. పు 161 మొ|| జూన్, పు. 541 మొ||, జూలై. పు. 57 మొ||; డి. సి సర్కార్, ఎపి ఇండికా, XXX పు. 19 మొ|| ఎపి. ఇండికా, XXXI, పు 99 102 లలో; టి వి మహాలింగం, ఎపి. ఇండికా, XXXI, పు. 94 98. ఎపి ఇండికా, XXVIII పు, 185 195 లు; కళింగ సంచిక, పు. 89.

35 ద హిం శా, VI, 1207.
36 ఎపి. ఇండికా, XXVIII, 185-189, కళింగ సంచిక, పు. 89 మొ॥
37 ద హిం శా. IV, 1084
38 ఎపి. ఇండికా, XXVIII, పు. 185 195; కళింగ సంచిక, పు. 89
39 ఎపి. ఇండికా, XXVIII, పు. 302-308; 'ఒరిస్సా హిస్టారికల్ రిసర్చ్ జర్నల్', v.i, పు. 1 మొ॥
40 అదే
41 దహింశా V 1189, 1225, 1226, 1227
VI. 933, 1052, 1053
IV. 975
42 దహింశా V. 1226
43 దహింశా V. 1225
44 క్రింద చూచునది.
45 దహింశా, V, 1227
46 దహింశా, VI. 933
47 దహింశా VI. 1052
48 దహింశా V. 1190
49 దహింశా. VI. 1053
50 దహింశా. IV. 975
51 దహింశా. V 1227
52 దహింశా. V. 1191
53 దహింశా. VI. 752
54 ఎపి. ఇండికా

55 ఎపి. ఇండికా, XXVIII, 302 308; ఒరిస్సా హిస్టారికల్ రిసర్చి జర్నల్' V.i, పు i మొll II.

56 దహింశా VI 752

57 ఎపి. ఇండికా. XXVIII, 302–308

58 దహింశా, XI. 753

59 దహింశా, VI. 1017, 1035, 765, 1037, 1033, 1034

60 దహింశా. VI. 1035

61 దహింశా. VI. 1017

62 దహింశా. VI. 765

63 దహింశా VI. 767

64 దహింశా VI. 768

65 దహింశా VI. 768

66 దహింశా VI. 1033

67 దహింశా VI. 1034

68 దహింశా VI. 731

69 దహింశా VI. 1113

70 దహింశా. VI. 1115

71 దహింశా VI 1069

72 దహింశా. VI. 1082

# అనుబంధము

సౌలభ్యము కొరకై ఈ క్రింది పట్టీ రూపమున అర్వాచీన తూర్పు గాంగరాజులు, వారి దేవేరులు, ఆ దేవేరులను పేర్కొన్న శాసనములు, ఆ శాసనముల కాలము ఇవ్వడమైనది

| రాజు | దేవేరులు | శాసనము | శాసనకాలము |
|---|---|---|---|
| 1) వజ్రహస్త దేవుడు | 1) పృథ్వీమహాదేవి | ద హిం శా V 1122 | |
| | 2) మారజయ | ,, V 1122 | |
| | 3) బెజియ | ,, V 1120 | శ. 990 |
| | 4) నంగమ | ఎపి. ఇం. XXVIII, 185 ఇమ్మడి నరసింహుని కెందుపట్నతామ్రపట్టికలు | శ. 1217<br>శ. 1218 |
| 2) రాజరాజ దేవేంద్రవర్మ | 1) రాజసుందరి | అనంతవర్మ చోడగంగుని కొర్ని తామ్రపట్టికలు. భారతి, 1925, నవం, పు. 101. ఆగ, పు. 74. | శ. 1003<br>శ 1034 |
| 3) అనంతవర్మ చోడగంగుడు | 1) లక్ష్మీదేవి | ద హిం శా. V. 1347. | శ. 1015 |
| | | ,, V. 1348 | శ 1015 |
| | | ,, V. 1079 | శ 1032 |
| | 2) సోమలదేవి | ,, V. 1012 | శ. 1030 |
| | 3) పృథ్వీమహాదేవి | ,, V. 1035 | శ 1035 |
| | 4) మరకమ్మ | ,, V. 1084 | శ. 1035 |
| | 5) రాజలదేవి | ,, IV. 1191 | శ. 1050 |

| రాజు | దేవేరులు | శాసనము | శాసనకాలము |
|---|---|---|---|
| | 6) పద్మలదేవి | ,, IV. 1192 | శ. 1050 |
| | 7) జయంగొండ చోడ దేవి (పట్టమహిషి) | ,, IV 1194 | శ 1050 |
| | 8 శియాదేవి | ,, IV 1195 | శ· 1050 |
| | 9) లీలావతి | ,, IV. 1196 | శ 1050 |
| | | ,, IV 1197 | శ. 1050 |
| | 10) కళ్యాణదేవి | ,, IV 1198 | శ. 1050 |
| | 11) లావణ్యావతీదేవి | ,, IV 1184 | ... ... ... |
| | 12) దెన్నవ మహాదేవి | ,, IV 1199 | శ. 1071 |
| | 13) కస్తూరికామోదివి | ఎపి ఇం XXVIII, 185 ఇమ్మడి నరసింహుని తామ్రపట్టికలు | శ 1217<br>శ. 1128 |
| | 14) ఇందిర | ,, | ,, |
| | 15) చంద్రలేఖ | ,, | ,, |
| | 16) సోమాంబిక | ద హిం శా. V 1076 | శ. 1037 |
| | 17) మమవవాదేవి † | ద హిం శా. V. 1043 | శ. 1045 |
| 4) కామార్ణవుడు | 1) మానమదేవి | ద హిం శా. V 1047 | ... ... ... |
| 5) రాఘవుడు | ... ... ... | ... ... ... | ... ... ... |
| 6) ఇమ్మడి రాజరాజా | 1) సురమ | స్వప్నేశ్వరుని భువనేశ్వర శిలా శాసనము (ఇమ్మడి అనియంక భీముని నాటిది) | |
| 7) ఇమ్మడి అనియంక భీముడు | 1) వాఘల్లదేవి | ఎపి. ఇం XXVIII, 185 ఇమ్మడి నరసింహుని తామ్రపట్టికలు | శ. 1217<br>శ. 1218 |
| 8) ముమ్మడి రాజరాజా | 1) మంకుణదేవి | ,, | ,, |
| 9) ముమ్మడి అనియంక భీముడు | 1) కస్తూరీదేవి | ,, | ,, |
| | 2) గంగాదేవి | ద హిం శా VI 1207 | |
| 10) మొదటి నరసింహుడు | 1) సీతాదేవి | ఎపి ఇండికా XXVIII, 185 ఇమ్మడి నరసింహుని తామ్రపటిక | శ 1217<br>శ. 1218 |
| 11) ఒదటి భానుదేవుడు | 1) అన్నమాంబ | ద హిం శా IV 1084 | శ. 1196 |
| | 2) జాకల్లదేవి | ఎ. ఇండి XXVIII. 185 ఇమ్మడి నరసింహుని తామ్రపట్టిక | శ. 1217<br>శ. 1218 |
| 12) ఇమ్మడి నరసింహుడు | 1) చోడమహాదేవి | ఎపి. ఇండికా XXVIII, 302 నాల్మడి నరసింహుని పురి తామ్రపట్టికలు | |
| 13) ఇమ్మడి భానుదేవుడు | 1) లక్ష్మీదేవి | ,, | |
| 14) ముమ్మడి నరసింహుడు | 1) గంగాదేవి | ద హిం శా V. 1227 | శ. 1263 |
| | | ,, V. 1189 | శ. 1265 |

† ఈమెపేరు వ్యాసమున, పొరపాటున వదలివేయబడినది. శాసనమున "శ్రీ చోడగంగదేవర మమవవాదేవు కొడుకు శ్రీ మధుకేశ్వర దేవర" అని కలదు. ఇంకే వివరములు లేవు.

| రాజు | దేవేరులు | శాసనము | శాసనకాలము |
|---|---|---|---|
| | | ,, V. 1226 | శ. 1267 |
| | | ,, V. 1225 | శ. 1271 |
| | | ,, V. 933 | శ. 1271 |
| | | ,, VI 1052 | శ 1272 |
| | | ,, VI 932 | శ. 1272 |
| | | ,, V. 1190 | శ. 1274 |
| | | ,, VI. 1053 | శ 1275 |
| | | ,, IV 975 | శ. 1275 |
| | 2) కొమ్మిదేవి | ,, V. 1227 | శ. 1263 |
| | | ,, V. 1191 | శ. 1271 |
| | 3) బరుజాదేవి | ,, V. 752 (నాల్మడి నరసింహుని నాటిది) | శ. 1305 |
| | 4) కమలాదేవి | విపి. ఇండికా. XXVIII, పు. 302 నాల్మడి నరసింహుని పురి తామ్రపట్టికలు | |
| 15) ముమ్మడి భాను దేవుడు | 1) హీరాదేవి | ,, | |
| | 2) తారాదేవి | ద హిం శా. VI. 752 (నాల్మడి నరసింహుని నాటిది) | శ. 1305 |
| 16) నాల్మడి నరసింహుడు | 1) తారాదేవి | ద హిం శా VI 753 | శ. 1305 |
| | 2) లీలాదేవి | ద హిం శా. VI 1008 | శ 1316 |
| | | ,, VI. 1035 | శ. 1311 |
| | 3) ఉత్తమదేవి | ,, VI. 765 | శ. 1316 |
| | | ,, VI 1035 | ,, |
| | | ,, VI 1017 | ,, |
| | | ,, VI 1037 | ,, |
| | | ,, VI 1033 | శ. 1318 |
| | | ,, VI. 1034 | శ 1034 |
| | 4) పార్వతి లేక ముమ్మడ. | ,, VI. 731 | శ. 1328 |
| | 5) కమలాదేవి | ,, VI 1113 | శ. 1336 |
| 17) నాల్మడి భానుదేవుడు | 1) రాజలదేవి | ,, VI 1115 | శ 1336 |
| | 2) తల్లమదేవి | ,, VI 1069 | శ 1344 |
| | 3) ఎల్లమదేవి | ,, VI 1082 | శ. 1349 |
| | 4) చోండమహాదేవి | ,, VI. 784 | శ. 1352 |

—: స మా ప్త మ్ :—

# ప్రాచీనాంధ్ర శాసనములు

శ్రీ తిరుమల రామచంద్ర

ఈ గ్రంథము చక్కని గెటప్‌తో మంచి అచ్చుతో మంచి బైండుతో వుంది. ప్రతి గ్రంథాలయములోను ఉపయోగించుటకు వీలుగా అచ్చు వేయబడింది.

ఏదో పత్రికలో వ్రాసినట్లు శాసనాల చరిత్ర వ్రాయుట చాల కఠినమైనపని. కార్లైలు అన్నట్లు అసలు సమీక్ష అంటే ప్రతిభావేశములు లేని వారిని గురించి అట్టివి లేనివారికి వినుపించి చెప్పడమన్న మాట శాసనముల గూర్చి, వాని భాషను గూర్చి విశేష పరిశ్రమ గావించిన ఉత్తమ శ్రేణి విద్వాంసులు అయిన బూదరాజు రాధాకృష్ణగారిని నలుగురికి తెలియజేయాలి. శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు వ్రాసినట్లు ఈ గ్రంథము చరిత్ర, భాషారంగముల లోనే గాక పురావస్తు రంగములోను పరిశోధన చేయు విద్వాంసులకు ఉపయోగపడగలదని ఆశించాలి.

ఈ శాసన సంపుటి గూర్చి రాధాకృష్ణగారే చక్కగా పీఠికలో వ్రాశారు. 'అనేక ముఖ్యమైన తెలుగు శాసనాలు ఇంకా అముద్రితంగానే ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు గట్టి చర్యలు తీసికోవాలి. కోరాడవారు, చిలుకూరు నారాయణరావుగారు శాసనాల గురించి వ్రాసినా, శాస్త్రరీతిగా, చరిత్ర రీతిగా శబ్దార్థ నిర్ణయ విషయంలోకూడ కొన్ని లోపాలున్నాయి.' తొట్టతొలి తెలుగు శాసనం క్రీ. శ. 2వ శతాబ్ది నాటిది. దీనిలోని 269 శాసనాలలో 217 శిలాశాసనాలు, 52 తామ్ర శాసనాలున్నవి. ఇవి వివిధ పత్రికలనుండి తదితరత్ర సేకరించారట గ్రంథకర్త 60 సంస్కృత, 7 ప్రాకృత, 1 కన్నడంలో వున్నవి. శాసన కాలనిర్ణయం చిక్కుపని. కొన్నింటి కాలాన్ని చరిత్రాత్మక సంఘటనలను ఆధారం చేసుకొని చేశారు. లిపివేత్తల సహాయంతో కొన్నింటి కాల నిర్ణయం సుగమమయింది. తేదీల నిర్ణయంలో రాధాకృష్ణగారు బుహ్లర్ పండితుని కృషిని సంయమనాన్ని ప్రశంసించారు. మొత్తంమీద భాషా విశేషాలు సమంగా ఈ శాసనాలవల్ల దొరకటంలేదు.

చాలావరకు ఈ సంపుటిలోని శాసనాలు గోదావరీ దక్షిణ తీరాంధ్రదేశంలో దొరికినవే. గోదావరీ ఉత్తర తీర భూములవీ కూడ అన్నీ అనవచ్చును. తెలంగాణమునుండి 4, అలహాబాగ నుండి ఒకటి సేకరించారు. 8వ శతాబ్దం తరువాత 10వ శతాబ్దం వరకు గల ండలిక భాషా భేదములను పరిశీలింపవచ్చును ఎక్కువభాగం శాసనాలలో సంస్కృత తెలుగుల మణిప్రవాళ భాష వుంది. కొన్ని శాసనాలలో ఎక్కువగా తెలుగు వాక్యాలే వున్నవి. రెండు శాసనాల్లో సంస్కృత, కర్ణాట శాసనాల సంకృతలమధ్య తెలుగు వాక్యాలున్నవి.

ఈ శాసనాల్లో అత్యధిక సంఖ్యలో దానపత్రాలే వున్నవి. కొరవి శాసనం రచనా పద్ధతిలో నన్నయ వచన రచనకు దీటుగా వుంది. వీని పద్యరచనలలో లిపిముఖంగా గుర్తించరాని అర్ధానుస్వారాన్ని పునరుద్ధరించటానికి వీలుగా వుంటుందని రాధాకృష్ణగారి వాదము శ్రీనాథుడి తాతగారి ఊరు 'కల్పట్టనం' అని గుంటూరు జిల్లా రండుబల్లిలో దొరికిన శాసనంలో వ్రాశారు.

క్రీ. శ. 972 నాటి వాయల్పాడు (చిత్తూరుజిల్లా) శాసనంలో మనుస్మృతిలోని వ్యభిచార విషయక శిక్షాస్మృతి స్మరణకు తేబడింది. ఇది సాంఘిక చరిత్ర కారులకు వెలలేని విషయం.

బ్రాహ్మీ, దేవనాగరీ, ద్రావిడీ (డామిలీ) లిపిలో వ్రాయబడిన శాసనాలను రాధాకృష్ణగారు పరిశోధించారు. క్రీ. పూ. 200 ప్రాంతాల బ్రాహ్మీ లిపిని 'బుర్నెల్' పండితుడు వేంగీ చాళుక్య లిపియని, ఇతరులు తెలుగు-కన్నడ లిపియని పేర్కొన్నారు. దీనినుండి వచ్చిన శాఖను క్రీ. శ 650-950వరకు చాళుక్యలిపి అని నామకరణం చేశారు. ఆల్ బీరూనీ క్రీ. శ. 1030-నాటికే తెనుగు-కన్నడ లిపులు వేరపడ్డాయని వ్రాశాడు.

రాధాకృష్ణగారి వుపోద్ఘాతంలో కొన్ని వ్యాకరణ విశేషాలు కూడ విమర్శింపబడినవి ఒక అక్షరం ప్రక్కన వుండవలసిన అరసున్నను మొదట్లో తరువాతి అక్షరం పైన (.) చుక్కగానో లేక కుడివైపు చుక్కగనో వ్రాసేవారట. అది క్రమంగా సున్నగా మారిందని కనుగొన్నారు నన్నయ తరువాత సున్న ఒకే పంక్తితో వ్రాయబడుతూ వచ్చింది. ఱ, ళ, ఱు, ష్ణ అనే అక్షరాలు కూడ ఈ శాసనాల్లోనే లభ్యపడుతున్నాయి.

రాధాకృష్ణగారే వ్రాసినట్లు ఈ గ్రంథంలో భాషా చరిత్రకే ప్రాముఖ్యం కనబడుతుంది. శాసనకాలం శాసన పాఠాలకిందనే వ్రాశారు. ఆంగ్ల లిపిలోను. తెలుగు లిపిలోను శాసనాలను అచ్చు వేయుటవల్ల ఆంధ్రేతర పండితులకు కూడ ఈ గ్రంథం పరిశోధనలకు అనుకూలంగా వున్నది. వర్ణమాలాక్రమంలో శాసనాలలో పేర్కొనిన ఇంచుమించు అన్ని పదాలకు ఇంగ్లీషువివరణతోబాటు సూచిక యున్నది ఈ శాసన భాషాధ్యయనం వలన తెలిసే ముఖ్య విశేషాలను ఆంధ్ర, ఆంగ్ల భాషల్లో వ్యాసాలుగా వ్రాశారు

వీరు సుప్రసిద్ధ పరిశోధకుల సహాయం ఏంతవరకూ పొందారో వివరించి తమ వినయాన్ని ప్రకటించుకున్నారు. ఉపయుక్త రచనలు పట్టికవలన ఈ భాషా శాస్త్రాధ్యాయులకు దారితెన్నూ తెలుస్తున్నది.

విరి లఘుపీఠిక, చరిత (పేరుకు లఘువన్నారు కాని 109 పుటలున్నవి) ఏమాత్రం విసుగులేకుండా చదివెయ్యొచ్చు

మచ్చుకు శాసనాల పదజాలాన్ని వివరిస్తాను.

అఇన = అయిన, అకణ్డవత్తి =అఖండవత్తి, అత్తిలి= అత్తిచెట్లు, అధిష్ఠాణుంబ్ = పరిపాలకుడు; అముదునకు= దేవతలకిచ్చే బల్యన్నంకోసం, అరుహాణ్= deserving man, అటిసిన= అళియు నశించుకు విశేషణం, అటిసికొన్న= స్వయంగా స్వంతంచేసుకొన్న, అడ్వాని= అళ్వారువికృతి; ఏంట= యేటా, అదితి= రాజోద్యోగి, ఏం బది =యాభై, ఉరి =పోగొట్టుకొని, ఇప్పటికీ మధ్రానులో కొందరు కోతికి కోంతి అంటారుగా! ఉరువు =శాల్తీ, వస్తువు, ఒంగ్గేలు (వంకలాగు); ఓయం= మోయటానికి కట్టిఇచ్చి= కట్టించి; కణంగి =కడంగి, కుటు గి= గుట్టమీద; గంగ్గ= గంగ, క్రొచ్చివా= చెక్కిన, గొణకె = గణకుడయిన చీకున =చీకటిలో; డంచ్చి =డంచి, తబుణ్డు = తమ్ముడు, తాగిరి= సాకిరి= రక్షించిరి తోలు =ఆవు; దణ్డ = గండుగ; దమ్మువులు= ధర్మాలు; నడుపు =అధికారి; నడుపు ళ్ = అధికారులు; నిబంధకాలును= వార్షికాలు తీసుకునేవారు; నివబు= బలాంజలి, నెవం; పడిAllowance భృతి, నైవేద్యం; పడిగి =తిట్టి, నెగడిన= పేరుమోసిన, పడల్= పడవాలు,[91] చిన్నసేనాపతి భడవాలో (పా) పడువరంబు= పన్ను మినహాయింపు; పరియారు న, పనతి =పన్ను లేనిభూమి, పరువుల = విశాలస్థలాలు పళ్లి= పల్లె; పాటి =శవారు పాఱ =బ్రాహ్మణుడు, పాఱు =బ్రాహ్మడు పుణరు= పునర్వసు నక్షత్రం. పుటి> పుర్రె= పాత్ర: పెణ్డ్లము =భార్య సేరామణి = పేర్ ఆవణి శ్రావణపూర్ణిమ: పొంటి =కోసం, కొరకు: ప్రతిరవలు= అడ్డంకులు; ప్రతిరోమంబు =వ్యతిరేకత, బాణ= పరాక్రమం. జెండా; బాహత్తరి =గొప్ప, బూత = గామణి> Skt భుక్త) బోయ= గ్రామాధికారి; ముయ్యలి =మూ ఎల్ల–మూడుహద్దులకు, మొగమాడుల్ =ముఖమంటపం, రచ్చ =రాజమార్గం, పదిమంది చేరేచోటు; రట్టోడి= గ్రామాధికారి, రడ్డి, అచ్చు =ధ్వంసంచేసే

చివరి కోశమునుబట్టి చూస్తే ఎన్నో పదాలు నాటికి నేటికి ఆయా మండలాల్లో ఒకలాగే వున్నవని కూడ తెలుస్తున్నది. శాసనాల అభిప్రాయం కీర్తికాని, రాజప్రశస్తికాని దానధర్మాలుకాని ఆచంద్రతారార్కం ఉండాలని పరిపాలింపబడాలని. ఉదాహరణకి క్రీ శ. 850 నలజనంపాడు కనిగిరి తాలూక నెల్లూరు శాసనం చూడండి. పల్లవ బాదిరాజా మూడుపుట్ల విత్తువం పొలం దానం ఇచ్చినాడు. ఆ దాన శాసనాన్ని ఆ కోరికను మన్నించినవారికి అశ్వమేధయాగం చేసినంత పుణ్యం వస్తుందని శాసనాన్ని ధ్వంసం చేసినవారికి శ్రీ పర్వతం ధ్వంసం చేసినంత పాపం తగులుతుందని వ్రాయించాడు. పాప పుణ్యములు చక్కగ నమ్మిన ఆ కాలానికే అది చెల్లింది!

శాసనపు అభిప్రాయానికి అడ్డుపడువారికి పంచమహాపాతకం చుట్టుకుంటుందని శాపనార్థాలు కూడ శాసనాల్లోనే చెక్కివుంటుంది. రాజులే కాక ధనికులైన కోమట్లు, వర్తకులు ముత్తరాజులు మొదలగువారు కూడ దానాలుచేసి దానశాసనాలు చెక్కించారంటే ఆశ్చర్యమేమీలేదు

ఇదివరలో అనేక శాసనాల చర్చలు 'భారతి'లో అచ్చుపడి పండితులకు తోడ్పడినవి. అన్నింటిని, మరికొన్నింటిని సేకరించి ముద్రించి ఒకేచోట లభించేటట్లు చేసిన సాహిత్య అకాడమీవారిని శ్రీ బూదరాజు రాధాకృష్ణను కూడ ఎంతో అభినందించాలి. దీనిని చదివి, పాఠకులు సాధ్యమైనంత ఘనంగా లాభం పొందాలని ఆశిస్తున్నాను

---

## ప్రాచీనాంధ్ర శాసనములు

(క్రి. శ. 1100 వరకు)

పాఠ, పదకోశ, సంగ్రహ భాషాచరితలో—

డా॥ బూదరాజు రాధాకృష్ణ

ప్రచురణ : ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-4.

సుమారు : 645 పేజీలు. వెల : రు. 20/ ఇది క్రి. శ. 1100 వరకుగల తెలుగుశాసనాల సంపుటి.

# కలగూరగంప

## రెక్స్‌స్టవుట్

"నా రెండో పిల్లి బైబిలుని రెండు సార్లు చదివిందనటం నిజంకాదు. ఒక సారే చదివాను," అని ఈమధ్యనే ఒక ఇంటర్వ్యూలో అన్నాడు డిటెక్టివు నవలలు రాసి పేరుగడించుకున్న రెక్స్ స్టవుట్. అపరాధ పరిశోధక నవలలంటే తక్కువగా చూడక్కర్లేదు—ఎడ్గార్ అలాన్‌పో, ఆర్థర్ కానన్‌డాయల్, జార్జెస్ సిమినాన్‌లు "నేరా"ని వస్తువుగా తీసుకుని కథలురాసి అందరి మెప్పులూ పొందారు. ఈ జాబితాకి ఇప్పుడు రాస్తున్న కొందరి పేరులుకూడా చేర్చవచ్చునేమో. (కొంతకాలంకింద జె. బి. ప్రీస్ట్లీ ఒక ప్రసంగంలో "మొదలు, మధ్య, చివర ఉన్నవి డిటెక్టివ్ నవలలేకదా? తక్కిన నవలలు ఒక స్థిరమయిన రూపం లేకుండా పోతున్నాయి." అన్నాడు.) స్టవుట్ అన్న మాటలనిపట్టి అతను జాన్సన్, మెకాలేలలాగ చాలా చిన్నప్పుడే తన తెలివిని చూపించుకునేవాడనుకోవచ్చు. అతని నవలలు శుద్ధ అమెరికా నవలలు, అందులోనూ తూర్పు, ఉత్తరం అమెరికా వయిపు నవలలు. వాటిలో ఇండియాలో ఎందరినో (కనీసం పుస్తకాలు, రేడియోద్వారా) తెలిపిన "యూరోపు సంస్కృతి" బాగా కనిపిస్తుంది. సుప్రసిద్ధ అమెరికా సంపాదకుడు హెచ్. ఎల్. మెంకెన్ సంస్కృతి అంటే బీర్ తాగటం, ఒకరకం పాశ్చాత్య సంగీతం కచేరీలు (క్లాసికల్ మ్యూసిక్‌ని అభిజాత్య సంగీతం అని అనువాదం చెయ్యగలిగితే ఈరకం సంగీతం కచేరీలు) వినడమే అనుకునే వాడని ఎవరో ఒకసారి హేళనగా రాశారు.

స్టవుట్ నవలలలో 'నారోవుల్ఫ్' అనే డిటెక్టివ్ వచ్చినాక అతనికి పేరు తెచ్చిపెట్టాయి. వాటిని చదివినవాళ్లకి స్టవుట్ అభిప్రాయంలో సంస్కృతి అంటే మంచి భోజనాలుచేసి పూలమొక్కలు పెంచటమేనా అన్న అనుమానంరావచ్చు కాని, నారోవుల్ఫ్ యుగోస్లావ్ ప్రాంతంనుంచివచ్చి అమెరికాలో స్థిరపడిపోయినవాడు. అతని 'ఎసిస్టెంటు' లార్సిగుడ్విన్ ఓహాయొనుంచి వచ్చినవాడు—అమెరికా అంతర్యుద్ధంలో "మానీయనే గెలిచింది" అని సంతోషిస్తాడు కాబట్టి స్టవుట్‌కి లేనిపోని దక్షిణాది సానుభూతులు లేవని ఊహించవచ్చు! నీగ్రోలనిగురించి రాసినప్పుడు స్టవుట్‌కి ఎంత "విశాలమయిన" దృష్టి ఉందో కొంతదాకా తెలుస్తుం దనిపిస్తుంది. రెక్స్‌స్టవుట్ నవలలు ఏవి చదివినా "అతను ఇంగ్లీషు వింత తేలికగా రాసేస్తాడు!" అనికూడా చదువరులకి అనిపించక తప్పదు. నారోవుల్ఫ్ ఎక్కువగా కదలలేని చాలా లావుమనిషి. నేరాలని శోధనచేసి బతుకుతాడని తక్కువగా చూసేవాళ్లని అతను తగినట్లుగానే మందలిస్తూ ఉంటాడు. పాతకాలపు వాళ్లు ఒకళ్లనొకళ్లు హత్యలు చేసుకొనటాన్ని గురించి చదివేవాళ్లు ఇప్పటికాలం హత్యలని గురించి చదవటానికి ఎందుకు మొహమాట పడాలి? రెక్స్‌స్టవుట్ నవలలు చదివేవాళ్లెవరూ తమ కాలాన్ని వృధాచేస్తున్నారనలేము! అతని మరణవార్తని విన్నప్పుడు "కొత్త నారోవుల్ఫ్ లేక లార్సీ గుడ్విన్ నవలలు ఇంక రావుకదా!" అని ఎందరో అనుకుని ఉంటారు.

— ఓ. వి.

## "కావ్యాత్మ" — ఒక పరిశీలనము

ధ్వన్యాలోకములో నొక కారికకు అనుపూర్వి (క్రమము) ఇట్లున్నది.

"అర్థః సహృదయ శ్లాఘ్యః
కావ్యాత్మేతి వ్యవస్థితః ।
వాచ్య ప్రతీయ మానాఖ్యౌ
తస్య భేదావుభౌ స్మృతౌ॥"

(ధ్వన్యాలోకము 1 ఉద్యో. 2 కారిక)

ఇచ్చట దీనికి (ఈ కారికకు) వృత్తి గూడ నిట్లున్నది.

"కావ్యస్య లలితోచిత సన్నివేశ చారుణః శరీరస్యే
వ ఆత్మా సారతయా స్థితః సహృదయ శ్లాఘ్యోయో ఽ
ర్థః. తస్య వాచ్యః ప్రతీయ మానశ్చేతి ద్వౌ భేదౌ."

(లలితములు సముచితములునగు సన్నివేశములతో మనోహరమైన కావ్యమునకు, శరీరమున కాత్మవలె సారభూతముగనుండి సహృదయులు మెచ్చుకొను నర్థమేది గలదో దానిలో వాచ్యము, ప్రతీయమానమనని రెండురకములు గలవు.)

ఇచ్చట కారికను, వృత్తిని, పరిశీలించినచో నీ యర్థము స్ఫురించుచున్నది.

"సహృదయ శ్లాఘ్యమైన అర్థమేదో అది కావ్యాత్మ" అని.

కాని వాచ్యార్థము కావ్యాత్మయని ఆనంద వర్ధనాచార్యులుగాని యితరాలంకారికులుగాని అంగీకరించుటలేదు. ఈ కారికను ఉన్నదున్నట్లుగా పరిశీలించినచో, దాని స్వారస్యమును బట్టికాని, దాని వృత్తిని బట్టికాని "వాచ్యమైన కావ్యార్థము గూడ సహృదయ శ్లాఘ్యమైనచో దానికిని కావ్యాత్మత్వము" ఆనందవర్ధనున కభిమతమని తోచుచున్నది.

ఈ కారికకుంగల వ్యాఖ్యానములలోను టిప్పణులను మహాసంరంభముతో వాచ్యార్థమునకు కావ్యాత్మత్వము నిరసింపఁబడియున్నది. కాని వానిలో నెక్కడనైనను కారికకు యథాశ్రుతముగ అన్వయక్రమమును ఏ వ్యాఖ్యాతయుఁ జూపించియుండలేదు.

ఇచ్చట కారికలో 'సహృదయ శ్లాఘ్యత్వ రూపమగు విశేషణము ప్రతీయ మానార్థమునకే యెట్లన్వయించును? వాచ్యార్థమునకా విశేణ మేల అన్వయింపదు?' అను విషయమున స్పష్టీకరణము జరుగవలయుండెను అది యెచటను నాకుఁ గన్పింపలేదు. పూజ్యులగు నభినవ గుప్తపాదు లిచట నిట్లుపదేశించిరి.

"తుల్యేఽర్థరూపత్వే కిమితి కస్మైచిదేవ సహృదయాః శ్లాఘంతే, తద్భవితవ్యం కేన చిద్విశేషేణ. యోవిశేషః సప్రతీయమానభాగః వివేకిభిః విశేషహేతుత్వాదాత్మేతి వ్యవస్థాప్యతే వాచ్యసంవలనా విమోహిత హృదయైస్తు తత్ పృథగ్భావే. విప్రతిపద్యతే చార్వాకైరివ ఆత్మపృథగ్భావే. అతఏవ "అర్థః" ఇతి ఏకతయా ఉపక్రమ్య సహృదయ శ్లాఘ్య ఇతి విశేషణద్వారా హేతుమభిధాయ అపోద్ధార దృశా తస్య ద్వౌభేదౌ అంశౌ ఇత్యుక్తం నతు ద్వావప్యాత్మానౌ కావ్యస్య."

ఈ విషయమునే వ్యాఖ్యాత లందఱును విస్తరముగా విశదీకరించిరి. "వాచ్యమగు నర్థము సహృదయ శ్లాఘ్యముగాదు. ఇందువలన ప్రతీయమానార్థము మాత్రమే కావ్యమున కాత్మ" అని.

ప్రతీయమానార్థము కావ్యమున కాత్మయగుఁగాక! అంత మాత్రమున వాచ్యములైన కావ్యార్థములకు సహృదయ శ్లాఘ్యత్వము పూర్తిగా నేల నిరాకరింపవలెనో నాకుఁ దెలియకున్నది. వాచ్యమైన కావ్యార్థమునందుఁగూడ సహృదయ శ్లాఘ్యత్వమున్నదిగదా! అట్లు గానిచో ఉత్తమము, మధ్యమము, అధమము అని కావ్యవిభాగము చేయుటయే కుదురకపోవును. మధ్యమాధమ కావ్యార్థములకు సహృదయ శ్లాఘత్వములేనిచో ఆ కావ్యార్థముల కాశ్రయములగు కావ్యములకు కావ్యత్వమే పొసఁగదు. "సహృర్థమాత్రేణ కావ్యత్వ వ్యపదేశః. లౌకిక వైదిక వాక్యేషు తదభావాత్. తదాహ సహృదయ శ్లాఘ్యేతి" అని అభినవ గుప్తాచార్యులే చెప్పియుండిరి. మధ్యమాధమ కావ్యార్థములకు సహృదయ శ్లాఘ్యత్వము కొంచెమైన నంగీకరింపరింపనిచో ఆ ఉభయ కావ్యముల కావ్యత్వమునకు తిలాంజలి వదలవలసినదే. కావ్యములు త్రివిధములని సర్వాలంకారికులు నంగీకరించియున్నారు. పైగా పండితరాజు కావ్యములకు చాతుర్విధ్యమును గూడ నంగీకరించెను.

వ్యవహారదశలో ఆత్మకు నానాత్వమును అద్వైతులు గూడ నంగీకరించుచున్నారు. అట్లే యిచ్చటను కావ్యము లనేకములు గాన కావ్యాత్మకుఁ గూడ నానాత్వ మంగీకరించినచో బాధ యేమియును లేదు. ముఖ్యమైన ఆత్మకే యొకచోట నానాత్వ మంగీకరించుచున్నప్పుడు కావ్యార్థ రూపమై గౌణమగు నాత్మకు నానాత్వ మంగీకరించుటలో బాధకమేదియుఁ గన్పించుటలేదు.

ఈ విధముగఁ గావ్యమునఁ గూడ సారము, సారతరము, సారతమము (అనఁగా శ్లాఘ్యము, శ్లాఘ్యతరము, శ్లాఘ్యతమము) వగు అర్థములను దీసికొని ఆత్మను పక్రృష్టతరము. ప్రకృష్టతమముగా వ్యవహరించుట సరిగానుండును. ఈ విధముగా నైనచో నీకారికకు స్వారసికమగు నర్థము ననుగ్రహించినట్లగును.

మధ్యమము, అధమమునను కావ్యభేదములను మాత్ర మంగీకరింతుముగాని వానికి ఆత్మను మాత్ర మంగీకరింపము అనుట మాత్రము బొత్తుగా యుక్తముగాదు. ఎందువలనన రమణీయార్థ ప్రతిపాదకమగు శబ్దమే కావ్యమునకు శరీరముగా నంగీకరింపఁబడు చున్నదిగదా! ఆ శరీరము నందాత్మ నంగీకరింపనిచో అప్పుడా కావ్యము శవమువలె జుగుప్సాకరము (రోతను గలిగించునది) అగును. గాన కావ్యాభిలాషులకు కావ్యపఠనాదులయందు ప్రవృత్తియే కలుగకుండవలెను. కాని, లోకములో సహృదయులకు ఉత్తమ కావ్యమునందువలె మధ్యమాధమ కావ్యములందును నొకప్పుడు ప్రవృత్తి గలుగుచున్నది. కావునఁ దప్పనిసరిగ ఆ కావ్యభేదములకును "ధ్వనికావ్యాత్మ" కంటె కొంచెము తక్కువదైన ఆత్మ నంగీకరింపవలసియే యుండును

విచారించి చూడఁగా ధ్వన్యాలోకములో నచటనే ఐదవ కారిక

యందు "కావ్యస్యాత్మాస ఏవార్థః" అను దానిలో అన్యయోగ వ్యవచ్ఛేదకమగు 'ఏవ' కారముతో వ్యంగ్యార్థమునకు మాత్రమే కావ్యాత్మత్వము నానంద వర్ధనాచార్యులు నిరూపించినట్లగపడుచున్నది. అయినను ఇప్పుడు చూపిన పద్ధతిగా ప్రతీయమానార్థము కావ్యమునకు ప్రకృష్టతమగు ఆత్మయని చెప్పవచ్చును. లేదా 'ఏవ కారమును భిన్న క్రమముగాను అయోగ వ్యవచ్ఛేదకముగాను కల్పించి "సోఽర్థః కావ్యస్య ఆత్మైవ" (ఆ యర్థము కావ్యమున కాత్మయే) అని యీ వాక్యమున కర్థము చెప్పవలెనని తలంచుచున్నాను.

ఉత్తమ మధ్యమాది నామములతో కావ్యములను వ్యవహరించుట ఆనంద వర్ధనాచార్యులకంటె ముందుగనే ఆలంకారిక జగత్తులో నున్నదని భారవియొక్క యీ దిగువ వాక్యమువలన దెలియుచున్నది.

"స్తువంతి గుర్వీ మభిధేయ సంపదం
విశుద్ధి ముక్తే రపరే విపశ్చితః"

ఆనంద వర్ధనాచార్యులచే వ్యవస్థాపితమైన ధ్వనినే భారవికవి "గుర్వీ అభిధేయ సంపత్" అని చెప్పినాడని భావించుచున్నాను.

ఇచట భారవికి "గుర్వియగు అభిధేయ సంపద"యే కావ్యాత్మగా అభిమతమై యున్నదని ఆయనయొక్క యీ వాక్యము చేతను, అర్థగౌరవమును, నారికేళ పాకమును గల కిరాతార్జునీయ కావ్యము చేతను దెలియుచుండుట గమనింపదగి యున్నది.

("గైర్వాణి" నుండి)

మూలము :— శ్రీ య. కృష్ణశర్మ

—శ్రీ అవ్వారి వాసుదేవ శాస్త్రి

## "జాతివాదం"

జాతివాదంఅనేమాట తెలుగులో కొంతఎబ్బెట్టుగా తోచవచ్చు మనదేశంలో జాతికిసంబంధించినచైతన్యానికి సహూత్రం తక్కువలేదు, ఇప్పుడు కూడా చైతన్యం బలంగానే ఉందనాలి. ఇంగ్లీషులో 'రేసిసమ్' (Racism) అనే మాటకి ఈ విధంగా అనువాదంచేస్తే మరొక ఇంగ్లీషుమాటని మనస్సులో ఉంచుకుని తలకిందులయిన జాతి చైతన్యంకూడా కనిపిస్తోందంటే అతిశయోక్తికాదేమో! అయితే, తెల్లజాతివాళ్లు ఎవరయినా తమజాతికి సంబంధించిన అహంకారాన్ని ప్రకటిస్తే ఆజాతికి చెందనివాళ్లు, కనీసం చెందమనుకునేవాళ్లు చాలా కలవరపడుతారు. ఇందులో ఆశ్చర్యపడవలిసింది ఏమీలేదు. కొంతకాలంగానయినా యూరోపుదేశాలవాళ్లు కొందరు సామ్రాజ్యాలు స్థాపించి తమ ఆధిక్యతని చాటుతూనే ఉన్నారు.

భారతదేశంలో జాతివాదం ఎప్పుడూ లేదని ఎవరూ అనలేరు. దీనికి వ్యతిరేకంగా కొన్ని ఉద్యమాలు జరుగుతూనే ఉన్నప్పటికీ ఆధునిక కాలాలలోనే జాతివాదానికి వ్యతిరేకత కొంచెం పదివెయ్యి గలుగుతోందని అంగీకరించాలి.

జాతికి సంబంధించిన విచక్షణని అన్నివిధాలుగానూ ప్రతిఘటించటానికి భారత దేశాన్ని పాలించేవారు పూనుకున్నారు కాబట్టి అంతర్జాతీయ వేదికలమీద జాతివాదాన్ని ఖండించే ప్రయత్నానికి మద్దత్తు ఇవ్వటంలో ఆశ్చర్యం లేదు. ఐక్యరాజ్య సమితిలో ఇస్రాయిల్ జాతివాదాన్ని నమ్మే దేశంగా ఖండింపబడింది. ఈ ఖండన అరబ్బు దేశాలు మొదలయినవి తయారుచేసినవి. ఇది సహజమే కాని, "యూదులకి ఒక దేశం ఉండాలన్న వాదం జాతివాదం అవుతుందా?" అని ఆలోచించి చూడటం అవసరం. యూదులు, క్రైస్తవులు మహమ్మదీయులు ఒక వర్గానికి చెందినవారే అంటారు. చివరిరెండు మతాలలో ఎవరయినా చేరవచ్చు. యూదుల మతంలో ఇది వీలుకాదని కొందరి నమ్మకం. "హైందవమతం" లో చేరడంకూడా వీలుకాదని కొందరంటారు. ఇటువంటి అభిప్రాయాన్ని కాదనటంకూడా కష్టమే. "హైందమతం"లో ఎన్నోరంగుల, జాతులవాళ్లు ఉన్నట్లే యూదులలోనూ ఉన్నారు. నీలంకళ్ళు, బంగారుజుట్టూ ఉన్న యూదులు కూడా ఉన్నారు. ఇక "యూదులజాతి" ఏమిటి?

యూదులకోసం ఇస్రాయిల్‌ని సృష్టించటం మంచిపని అని ఎవరూ గట్టిగా వాదించలేదు. కాని, ఇది అయిపోయినపని. ఎన్నో రంగుల, జాతుల యూదులు ఇస్రాయిల్‌లో జీవిస్తున్నారని వింటాము. (ఇక్కడకూడా అంత తెల్లగా ఉండని యూదులని తెల్లగాఉండేవారు తక్కువగా చూస్తారని అంటారు. తెల్లజాతివారి జాతి చైతన్యానికి ఇది మరొక నిదర్శనమేమో!) ఇలాగ కలిసి ఉండటం జాతివాదాన్ని ఎలాగ బలపరుస్తుంది?

కొన్ని సంవత్సరాలకింద ఈజిప్టు నాయకుడు అబ్దుల్

కమాల్ నాసర్ 'అరబ్బులూ, ఇ సాయిల్ దేశస్థులూ అన్నదమ్ములని' అన్నారు (అందుకనే ద్వేషాలు ఎక్కువఅనికూడ ఆయన అన్నా !) అరబ్బులు తమ జాతికి చెందిన మరొక దేశం వారిని జాతివాదులని విమర్శించటం వింతగా ఉంటుంది.

రాజగోపాలాచారిగారు ఒకసారి భారతదేశం "వర్ణసమస్య" (కలర్ ప్రాబ్లెమ్) ని పరిష్కరించగలిగిందన్నారు కుల వ్యవస్థ ఉన్న ఈ దేశంలో "పరిష్కారం" జరగటం ఏమిటనిపిస్తుంది కాని ఆయన మాటలలో నిజంలేకపోలేదు భారతదేశంలో అవలంబించబడిన పద్ధతులని గురించి అరబ్బుదేశాలకి వారికి ఎందుకు చెప్పి చూడకూడదు?

— *ఒక విలేఖరి.*

## గణపతి—తెలుగు సాహిత్యము

ఈ పై శీర్షికలో కళా ప్రపూర్ణ శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు అక్టోబరు-భారతిలో నొక వ్యాసము రచించియుండిరి. అందు మొదటి గణేశ స్తోత్ర పద్యము, నరస భూపాలీయమునుండి యెత్తిచూపించి, దానికి మూలమును సంస్కృతమునుండి చూపించిరి. పిమ్మట అప్పకవిగారు తమ చందోలక్షణ గ్రంథమందు (అప్పకవీయము) చేసిన గణపతి స్తోత్రమును ఇట్లు ఉదహరించిరి !

"తనయునియొక్క యెత్తుననె దక్షజయు న్నిటలాక్షుడున్ ముదంబున నిరు చెక్కులం గొనుచు ముద్దుగొనంగ నొకింత నెమ్మొగం బనువుగ నెన్కకుం దిగిచి, యుత్స విహాస సరస్వరాస్యచుం బనములు తల్లిదండ్రులకు నన్నునగూర్చు గజాస్యునెన్నెదన్."—

అని ... ...

కాని దీనికి మూలమును వారు చూపలేదు. వారు మూలమును చూచిరో లేదో, తెలియదు. వారి వ్యాసమునకు పూరణగా నొసంగుటయే, ంట ధ్యేయముగాని, శ్రీ వెంకటరావుగారితోడగాని, అప్పకవిగారితోడగాని, "పొత్తునకు కేల్ కలపందలపోసి కాదు". మన్నింతురుగాక !

వెనుక మా యింటివద్ద సంస్కృతశ్లోకములు గల చిన్ని పొత్తమొకటుండెడిది. అది ఇప్పుడు కానవచ్చుటలేదు. అందొక సంస్కృత శ్లోకము కలదు. అది గణేశధ్యానము. దాని కర్త ఎవ్వరో అందు లేదు. కాని అది సరిగా పై పద్యమునకు సరిపోవును అది షుమారు 25, 30 సంవత్సరముల క్రింటిమాట . కనాడు నేను ఆ శ్లోకమునుగూర్చి, ముగ్ధుడనై, దానిని అనాడే, తెలుగు సేసితిని. ఆశ్లోకము, నా పద్యము ఇట్లున్నవి :

శ్లో॥ "గౌరీ గిరీశౌ స్వ గండ చుంబన లోలే
పితరౌ నిరీక్ష్య హేరంబః
తన్ముఖ మేళన కుతుకీ స్వాపన,
మపనీయ పరిహసన్ పాయాత్॥"

తే॥ గీ॥ 'పాలబుగ్గల ముద్దులలోలు రగుచు
మూరలన్ తల్లిదండ్రులు లోప్పారవారి
యాననైక్యంపు వేడ్కమై యాత్మవదన
మొకట వెన్నాగినగు వినాయకుండు బోచు॥"

— *శ్రీమాదిరాజు శ్రీరామమూర్తి.*

## లి పి సం స్క ర ణ

ఆర్యా !

తెలుగు లిపి సంస్కరణని గురించి డా. బయ్యా వెంకట సూర్యనారాయణగారు రాసిన వ్యాసం చదివిన తరువాత దీనిని రాయ లేకుండా ఉన్నాను.

1. అచ్చులు పోయ్యటం బాగా ఎక్కువ అయిన తరువాతనే లిపి సంస్కరణని గురించి ఆలోచనలు ఎక్కువ అవుతాయనిపిస్తుంది!

2. కొన్ని దశాబ్దాలుగా, (శతాబ్దాలుగా కూడానేమో!) అల వాటుపడిన లిపిని మార్చాలనుకున్నప్పుడు కొత్త లిపి పాతదానిని పోలి ఉంటే మంచిదే కాని ఒక దానిని చదివితే రెండోది స్ఫురించేట్లు ఉండాలి

3. చీనా భాషల లిపిని మార్చటానికి ప్రయత్నాలు చాలా జరుగుతున్నాయి ఇంతదాకా 'పాత' లిపిలోని గీతలని తగ్గించటానికి చేసిన ప్రయత్నాలు కొంతదాకా నయినా 'ఫలించాయి' కాని పూర్తిగా మార్చేసి ఎవరి ఆదరణనా పొందినట్లు కనిపించవు!

4. ఈ మధ్యనే మళయాళం లిపిని మార్చటం జరిగింది.

వత్తులు, గుణింతాలు మొదలయినవి కొంతదాకా హిందీ లిపిలో వచ్చినట్లు వస్తే మంచిదన్న సిద్ధాంతం మీద ఈ మార్పులు జరిగినట్లు కనిపిస్తాయి.

5. భారతదేశంలోని లిపులకీ ఇంగ్లీషు లిపికీ పోలికలు ఉన్నాయని అంగీకరించక తప్పదు. వీటిని గురించి ఎందరో ఇప్పటికి రాశారు

6. అందుచేత, ఎబ్బెట్టుగా కనిపించే సంస్కరణల బదులు ఇంగ్లీషు అక్షరాలనే వాడుకోవచ్చు! ఇంగ్లీషు స్పెల్లింగులు అవకతవకలు ఉన్నాయనిపిస్తే ఆ అవకతవకలని దిగుమతి చేసుకోవాలని లేదుకదా?

7. ఇంగ్లీషు అక్షరాలు సుమారు 52 ఉంటాయని అనుకుందాము. తెలుగులో అ, ఆ, ఇ, ఈ లన్నిటిని వేసుకున్నా 400 దాటవు. జపాన్ వాళ్లు 2400 అక్షరాలు ఉంటే టయిపు మిషన్ వాడుతారు. వారికి ఇది వింతగా తోచదు!

8. శ్రీ మద్దాలి రామచంద్రరావుగారు కొన్ని సూచనలు చేశారు. వత్తులని కొంచెం పక్కగా పెట్టుకుంటే అచ్చుకూర్పులో ఇబ్బందులు తగ్గుతాయని ఆయన అన్నారు. ఇంతదాకా వచ్చిన సూచనలన్నిటిలోనూ ఈ విలేఖరికి ఆయన చేసినవే సబబుగా ఉన్నాయనిపిస్తోంది.

9 ధ, ర, ష వంటివి కొన్నిటిని మార్చుకోవాలని ఇతర సంస్కర్తలు కొందరు అన్నారు. మహాప్రాణాన్ని సూచించే గీతని అల్పప్రాణపు అక్షరాలనే పెట్టవచ్చునని వారి సూచన. ఇదీ సమంజసంగానే ఉంది! ఇది అంత ఎబ్బెట్టుగానూ ఉండదు, అక్షరాల సంఖ్యా తగ్గుతుంది.

10. బలవంతంగా ఒప్పించేవాళ్లుంటే ఏ సంస్కరణయినా నిలుస్తుంది! మార్పులని పరిశీలించే వారిలోనే ఒక అభిప్రాయం లేనప్పుడు లిపి సంస్కరణ పెద్దగా సాగుతుందనుకోవటం పొరపాటేనేమో!

—(రా. రి)

## గ్రంథసమీక్ష - జాబుకు - సమాధానం

1975 అక్టోబరు నెల భారతి లో నేను 'శిథిలాలయం' (కర్త శ్రీ భైరవయ్య) పై వ్రాసిన 'గ్రంథవిమర్శ' ప్రకటింపబడింది. దానిలో నేను కథలో చమత్కృతి కానరాదనీ, 'జాత్యాభిమానము, జనవిహితుడు' వంటి ప్రయోగాలు కానవస్తున్నవనీ, అల్లినాడే హస్తినాపురంగా మారిన దనడం, కాశీ, రామేశ్వర, త్ర్యంబకాలలోని లింగాలే త్రిలింగాలనడం అసహజంగానూ, అసందర్భంగానూ కానవస్తున్నవని వ్రాశాను.

నా సమీక్షలోని లోపాలను తెలుపుతూ నవంబరు నెల భారతిలో పోటు-వెంకటకృష్ణారెడ్డిగారొక జాబును ప్రకటించారు. కథలో చమత్కృతి లేదన్న దానిని పురస్కరించుకుని 'సమీక్షకులు ఎప్పుడున్ను కావ్యంలో వున్న వాటినిగురించి చర్చించాలిగాని, లేనివాటిని ప్రస్తావన చెయ్యడం ఎందులకు?'' అని వారంటున్నారు. పుస్తకాన్ని విమర్శించేటప్పుడు అందులో కథాచమత్కృతి లేదనడం సమీక్షకుని ధర్మం కాదని వారన్నప్పుడు దానికి సమాధానం చెప్పనక్కరలేదు.

అల్లినాడే హస్తినాపురమనడం, కాశీరామేశ్వర త్ర్యంబకాలే తెలుగువారి త్రిలింగాలనడం అసహజమైతే కావచ్చునేమో కాని, ఆ సందర్భంగా ఎలా ఉన్నదో తమకు అర్థంకావడంలేదంటున్నారు. వారికి అర్థం కాకపోతే చరిత్రకారులను అడిగి తెలుసుకోవడం మంచిది.

43 పుటల ఆ పద్యకావ్యానికి 22 పుటల పరిమితి గల సద్విమర్శకుల పీఠిక లున్నవి. ఆ పీఠికలలో ప్రశంసించబడిన అమూల్య రత్నాలెన్నో ఉన్నవట. వానిని చెప్పకుండా విడిచి ఏవో లోపాలను నేను చూపినట్లు అనుకుంటున్నారు. ఆ రత్నాలేవో వెంకటకృష్ణారెడ్డిగారు వివరించి ఉంటే బాగుండేది.

నాకు రచయితపైగాని, గ్రంథంపైగాని దురభిప్రాయ మున్నదో, లేదో నా విమర్శలోని ''సరళమైన కవితలో శిల్పప్రశస్తి, ఆంధ్రప్రశస్తి ఇందు చక్కగా చిత్రించబడినవి'' అనే ఒక్క వాక్యం వల్లనే తెలుసుకోవచ్చును.

— శ్రీ బులుసు వేంకటరమణయ్య.

# గ్రంథ విమర్శలు

## కదిలే బొమ్మలు (కథల సంపుటి)

[రచన : అంగర వెంకటకృష్ణారావు ప్రచురణ: విశాఖ సాహితి. వెల రూ 4-00 పేజీలు 134, పుస్తకములు కావలిసిన వారీ క్రింది చిరునామాకు వ్రాయవచ్చును. విశాఖ సాహితి 25-15-204 మెయిన్‌రోడ్డు, విశాఖపట్నం-530001.]

ఇది కథానిక యుగము. నేటి సాహిత్యమున కథకధిక ప్రాధాన్యము గలదు. పాఠకలోకము దీనికి ప్రముఖస్థానమిచ్చి ఆదరించుటయే గాక, వారపత్రికలు మాస పత్రికలత్యంత ప్రాధాన్యమొసంగి రచయితలను ప్రోత్సహించుచు కథా సాహిత్యమును అభివృద్ధిపరచుచున్నది ఈనాడు ప్రతివ్యక్తి కాలక్షేపముకొరకు కథలు చదివి ఆనందించుచున్నాడు. పురుషులకంటె స్త్రీలు కథలను చదివి కదారచయితలకు పరోక్షముగ చేయూతనందించు చున్నారు

ఆంగ్లసాహిత్యమునందు కథారచన పూర్వమునుండియు అభివృద్ధిచెంది యుండలేదు మొదటగా పద్యరూపమున కథలు వెలసినవి. పిమ్మట వచన రూపమున కథలు రచింపబడినవి 16, 17వ శతాబ్దములందలి ఇటలీ సాహిత్యము యొక్క ప్రభావము ఆంగ్ల కథానిక వాఙ్మయము పైనున్నట్లు నేత్తల అభిప్రాయము. కాలక్రమమున కథా సాహిత్యము నల్దిక్కులకు వ్యాపించినది. అమెరికా, ఇటలీ, రష్యా, ఫ్రాన్సు మున్నగు దేశములందలి కథారచయితలు తమ రచనలచే సామాజిక చైతన్యము కలిగించి మానవ మనుగడకు మార్గదర్శకులైరి. జాన్ గాల్సవర్ది, జోసఫ్ కన్‌రాడ్. డి. హెచ్ లారెన్సు ఆల్డస్ హక్సలీ, జేమ్సు జాయిస్, ఓ హెన్రీ, మామ్ మున్నగువారు కథానిక సాహిత్యమును పెంపొందించియుండిరి. వీరు వ్రాసిన కథలు సాహిత్యమునకు మకుటప్రాయములు. సంస్కృతమునందీ కథానిక రచన గలదనియు తరువాత మరుగుపడినట్లు చెప్పుటకు శాస్త్రములందు నిదర్శనములు గలవని పింగళి లక్ష్మీకాంతంగారు తమ 'సాహిత్య శిల్పసమీక్ష' అను గ్రంథమునందు పేర్కొనియుండిరి. అగ్నిపురాణమునందు ధ్వన్యాలోకమునందు కథానిక ప్రస్తావన గలదు. దీనినిబట్టి కథానికకు పూర్వచరిత్ర ఉన్నట్లు స్పష్టమగును. కాని నేడు లభ్యమగుచున్న సంస్కృత వాఙ్మయమునుబట్టి పూర్వ కదానిక స్వరూపమెట్టిదో గ్రహించుటకు నిదర్శనములు లేవని లక్ష్మీకాంతముగారే చెప్పిరి.

తెలుగునందు పంచతంత్ర హితోపదేశ కథలు, కాశీ మజిలీ కథలు, విక్రమార్కుని కథలు మున్నగునవి బయలుదేరినవి. మొదటివి కేవలము నీతి ప్రబోధకములు. రెండవవి మనోరంజకత్వమును కలిగించునవి. నవీన సాహిత్యమునందలి కథలు నీతి ప్రబోధకములు మాత్రమేగాక మనోరంజకత్వమును, వైజ్ఞానిక విశేషములను, జీవిత సమస్యల పరిష్కారమును సూచించుచు వ్రాయబడుచున్నవి. తెలుగులో కథలు వ్రాసినవారిలో గురజాడ, వేలూరి శివరామశాస్త్రి చింతా దీక్షితులు, చలం, మునిమాణిక్యం, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, బాపిరాజు గోపీచంద్, కుటుంబరావు, బుచ్చిబాబు, మాలతీచందూర్, పవని నిర్మల ప్రభావతి, రంగనాయకమ్మ, సులోచనారాణి మున్నగువారు ప్రధానులు. మన తెలుగు కథానికకు అంతర్జాతీయ ఖ్యాతి లభించినది ఆ రచయితలు, కథలు - పాలగుమ్మి పద్మరాజుగారి 'గాలివాన'. పురాణం సుబ్రహ్మణ్య శర్మగారి 'నీలి'. వీరివలన తెలుగు కథయొక్క ప్రాశస్త్య మితరదేశములవారు గ్రహింపగల్గిరి.

కథకు విషయము సంక్షిప్తము పరిమిత పాత్రలు సామాజిక సమస్య ప్రధానము. రచయితే కథ చెప్పుచుండును అవసరమగుచో పాత్రలచేత చెప్పించుచుండును. నవల, నాటకములవలె దీర్ఘమగు కథ, సంభాషణలు కథయందుండరాదని పెద్దల నిర్ణయము.

స్వర్గీయ అంగర వెంకట కృష్ణారావుగారు అప్పుడప్పుడు వ్రాసిన కథలను ఒక పుస్తకముగా ప్రకటించి రచయితకు స్మృతి చిహ్నముగా విశాఖ సాహితివారు కదిలేబొమ్మలు'ను లోకమునకు పంపినారు. ఇందులో నాగరికత, బల్లిసతనం, బాదంచెట్టు—తంబురా పెట్టె, హోమగుండం, కదిలేబొమ్మలు, గుర్రం, కలతపడ్డగంగి, ఎందుకు, పెద్దమనిషి, ముక్తధార సత్తురూపాయి, జవాబు చెప్పలేదు—అను పండ్రెండు కథలు గలవు. ఇందులో చెప్పుకొనతగినవి కొన్నిమాత్రమే. అవి 'నాగరికత'. గిరజాలజుత్తు పొడుగుగానున్న లుంగి, రోకలివంటి పొడుగైన కర్ర, మొదలగు వానితో జంతు మాంసపు అమ్మకపుదారుల స్వరూపము కానవచ్చును. వృత్తిలో ఉన్నంత వరకా విధముగానే ఉందురు. ఆ పని అయిన తరువాత నిగ

నిగమేరియు దుస్తులు ధరింతురు. వారు ధరించిన వస్త్రములందే నాగరికతేగాని మనసులందు నాగరికతలేదు. ఆ నాగరికతే ఉండిన యెడల పందినికాల్చి చంపుటకు వ్యక్తిసంపద్నుడు కాలేడు. పంది ప్రాణము తీయుట అనాగరికుని లక్షణము. ఈనాడు పెద్దమనుష్యులు నాగరికత పేరుచెప్పి చేయరాని పనులెన్నియో చేయుచున్నారు. ఇట్టి వారే సమాజమునందు నాగరకులుగా చెలామణి అగుచున్నారు.

ప్రేమలోపడి ఒకరి నొకరు అనుమానము పెంచుకొని ముక్కు పచ్చలారని బాలిక జీవితమును బుగ్గిపాలు చేయుటమే "హోమగుండం."

గోపాల్‌భార్య లత. ఆ గృహమున పనిమనిషి దేవుడమ్మ. ఇల్లాలుకంటె పనిమనిషిమీద వ్యామోహము పెరిగింది గోపాల్‌కు. ఈ విషయము లత గ్రహించి దేవుడమ్మను దండించినది. అయినను రాగబంధము వీడక పెనవేసికొనిపోయింది. దేవుడమ్మ భర్త జోసఫ్. ఈతడు మరియమ్మను మరిగినాడు. ఇతని వలనే మిస్నీ మరణించినది. దేవుడమ్మ చెడినదని జోసఫ్ గ్రహించి ఆమెను చంపవలయునని ఆహారమున విషము కలిపినాడు. అసలు విషయము తెలియక లత పేయుడే విషము కలిపినాడని గోపాల్ ఊహించెను. దేవుడమ్మే ఈ పని చేసినదని లత భావించినది. ఈవిధముగా రకరకములుగ ఊహించినారు. తుదకు పెద్దవాళ్లు రగిల్చిన ఈర్ష్య అను హోమ గుండములో పడి మల్లెపువ్వువంటి మిస్నీ ప్రాణము కోల్పోయినది.

రమాదేవికి ఢిల్లీలో ఉద్యోగం అయినప్పుడే రామనాథం గు రం మించి పడిపోయాడు. "స్త్రీలకి సంబంధించిన ఒక అంతర్జాతీయ సంస్థలో భారతదేశంలో అధికారిణిగా ఆమె నియమించబడ్డది ఢిల్లీనుంచి లండన్, న్యూయార్కు, పారిస్, బాన్, మొదలైన నగరాలుగా ఉద్యోగరీత్యా తరచు వెళుతూంటుంది."

ఆమె వెళ్లిపోయింది.

మరి తిరిగి రాలేదు.

గుర్రము పారిపోయింది.

రామనాథం – రమాదేవి భార్యాభర్తలు ఇద్దరూ చదువు కొన్నవారే. రమాదేవి స్త్రీ అగుటచేత పదవులు లేలికగా వచ్చినవి కాని రామనాథం అలాగుననే ఉండిపోయాడు. భార్యకీర్తి ప్రతిష్ఠలకు రావనాథం తలమున్కలైనాడు. రామనాథం రమాదేవిని బయట ప్రపంచమున అడుగుపెట్టవని హెచ్చరించి ప్రోత్సహించెను ఇంట్లో ఏ విధంగా అణగిమణగి యుండునో అదే విధంగా బయట కూడా ఉండునని భావించెను. అనుకొన్న దానికి వ్యతిరేకముగా జరిగినది. అయినా భార్యకు మా తము ముద్దుగా 'గుర్రం' అని పిలవలేకుండా ఉండేవాడుకాదు రమాదేవి పదవుల నుండి పెదవుల మీదకు లఘించినది. రామనాథం దూరమయ్యాడు.

రమాదేవి ఇతర్యతా పనులవలన రామనాథాన్ని గూర్చి ఆలోచించుటకు సమయము లేకపోయినది. ఇతర దేశములకు వెళ్లినవి మరి తిరిగి రాలేదు. గుర్రము అదృశ్యమయినది. మరల రాలేదు. అప్పటి నుండి రామనాథమునకు గుర్రమనిన తగని భీతి. సినిమా లల్లో గుర్రము కనబడితే చాలు పరుగులు బెట్టును. ఇంతటి పిరికి సన్యాసి రామనాథం. అందుచేతనే రమాదేవి రామనాథమును వదలి వెళ్లిపోయినది. ఆమెకు కావలసినవి కోరుకొనునది అతనిదగ్గరలభింపలేదు, గానుగెద్దువంటి అతని జీవితములో రాజీపడలేక మనసు మరలించుకొని వెళ్లిపోయినది అతని బ్రతుకు సహారా డిజర్టు.

'కలతపడ్డగంగ' కథాంశ ప్రేమకు సంబంధించినది. గంగ దొరను ఆకర్షించినది. అతని సౌందర్యమును మేడలు కట్టుకొన్నవి. తాను చేయుచున్నది అధర్మమే అయినను మనసు నిగ్రహించుకొనలేక దొర కౌగిలిలో ఇమిడిపోయినది. అమాయకుడైన తన భర్తను చూచి పిగ్గుతో తలవంచుకొన్నది. గంగను భర్త చాలా ప్రేమగా చూచినాడు కాని భర్తలో లేనిది దొరలో ఉన్నదని మురిసిపోయెను. కాంక్షను నిగ్రహించుకొనలేక వాంఛను నిర్బంధింపలేక సతమతమై తన్ను తాను సమాధానపరచుకొనలేని అశక్తురాలైనది. భర్తకు తీరని ద్రోహము కలిగినది. గంగ తన తప్పు తెలిసికొని భర్తతో లీనమయినది. కలతపడిన మనను కుదుటపరచుకొని ప్రయత్నించి పశ్చాత్తాపము చెందినది. తెలిసి చేసినను, తెలియక చేసినను గంగ చేయని నేరమే చేసినది.

'పెద్దమనిషి' ఈనాటి సంఘమునందలి దౌర్భాగ్య స్థితికి సంకేతము. సీతన్న బడ్డీకొట్టు పెట్టుకొని హాయిగా జీవితము సాగించినను భార్య గంగ అందము పెద్ద మనుష్యులకు చక్కలిగింతలు కలిగించుచున్నది సిగరెట్టు కాల్చుకొను నెపముతో పెద్దవారు కొట్టు దగ్గరకు వచ్చి గంగితో సరసములు ప్రారంభించేవారు. ఒక పెద్ద

మనుష్యుని దృష్టి గంగపై లగ్నమైనది. ఆమె ననుభవింపవలయు నని ఆశ చెలరేగినది. అనుభవించుటకు కంటకముగా నున్న భర్తయైన సీతన్నను జైలుపాలు చేసివారు మోసగాండ్రు. గంగను మాయమాటలతో ఇంటికి రప్పించి మానమును భంగపరచి తమకర్తవ్యమును చాటుకొనినారు. కొంతకాలమునకు సీతన్న బయటకు వచ్చినాడు జైలు నుండి. విషయము తెలిసికొని టి పి. బను కసితీరునట్లు కొట్టి పరుగులు పెట్టినా చివరను దొరికెను

పెద్ద మనుష్యులు చేసిన నేరమునకు తగినశిక్షలేదు. దానికి కారణము వారు సంఘమున పెద్దమనుష్యులుగా ముద్రవేయించు కొనుటయే. అమాయకుడు శిక్షను అనుభవించెను లోకమునకు కన్నులున్నను చూడనట్లు నటించి అమాయకులను బలిగా స్వీకరించి పెద్దమనుష్యులకు తృప్తి కలిగించుచున్నది ఇది నేడు జరుగుచున్న న్యాయము ధర్మము.

అంగర వెంకట కృష్ణారావుగారు కథలకు స్వీకరించిన ఇతి వృత్తము సామాజిక సంఘర్షణను సంబంధించినట్టిది. అయినను కథలందు పటుత్వము నశించినది కాలక్షేపమునకైనను పాఠకుడు వీనిని చదివి ఆనందింపలేక పోవచ్చును. టైటిల్ కథ కదిలేబొమ్మలు బల్లిపతనం, ఎందుకు, జవాబు చెప్పలేదు. మున్నగు కథలందు పస లేదు. ఆశయశూన్యము. కథలందు క్రొత్తదనము లేదు. ఇయితే రచయిత సమాజమందలి వ్యక్తి అగుటచేత అందులోనున్న అధర్మ ములను కన్నులముందు ప్రదర్శించినారు.

విశాఖ సాహితివారు రచయిత వ్రాసిన కథలను మంచివి ఎన్నుకొని ప్రకటించిన కథానిక సాహిత్యమునకు తురాయిగా ఈ కథల సంపుటి ఉండెడిది.

ఆంధ్ర పదేశ్ సాహిత్య ఎకాడమీవారి అర్థిక సహాయమువే ఈ కథల సంపుటి ప్రకటించినారు. కాని ప్రతివ్యక్తి కొనగలిగినంత ఖరీదు పెట్టలేదు. గ్రంథాలయములకే ఆ రేటు పరిమితముగా నున్నది.

ఈ నాడు వచ్చుచున్న కథలలో పోల్చి చూచినట్లయిన ఈ కథల సంపుటిని పాఠకుడధికముగా ఆనందింపక పోవచ్చును. ముందు ముందు విశాఖ సాహితివారు మంచి పుస్తకములను ప్రకటించెదరని నూనము తలంపవచ్చును.

— శ్రీ రామమోహన్.

# తెలుగులో సాహిత్య విమర్శ

[రచయిత : డాక్టర్ ఎస్. వి. రామారావు-ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు పి. హెచ్. డి. పట్టమునకు పాత్రమైన సిద్ధాంత గ్రంథము– ప్రచురణ : పసిడి ప్రచురణలు రాజ్ మొహల్లా' హైదరాబాదు–29; వెల : సాదా ప్రతి : 15 రూ. 310 పేజీలు]

'నేను విమర్శకుండను నన్నేమని చూచుచున్నావో కవుల గ్రంథముల కగ్నిపుల్లను; కవుల ముంగిటి మొండిచేయిని. కవులపాలింటి తుపాకి పిక్కను. వారు మెదుపుటంగికి నోటిమీద నిడ్చికొట్టెదను" (విమర్శక స్వభావము పీఠిక-1వ సంపుటము. కీ. శే పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు) విమర్శకుని పని కవుల గ్రంథములకు నిప్పు ముట్టించడమే అనుకొన్న వారు కూడా లేకపోలేదు కాని వ్యాఖ్యాతలు కవి తానై కనిపెట్టలేని కవి హృదయాన్ని ఆవిష్క రించటంలో అసామాన్యమైన ప్రజ్ఞ కనబరచేవారు గోరంత గుణాన్ని కొండంతచేసి మెచ్చుకొనే హృదయ వైశాల్యం మన వ్యాఖ్యాతలది. ప్రాచీన ఆంధ్రకవుల కావ్యాలలోని గుణాలను ప్రస్తుతించేటప్పుడు నాటికి మూలగ్రంథాలైన సంస్కృత గ్రంథాలలో ఆయా విశేషాలు ఉండి ఉంటాయనీ, వాటిని పరిశీలించి మెచ్చుకోవటం కాక ఎక్కడిది కక్కడ కూడ, కవిని స్తోత్ర పాఠాలతో ముంచెత్తటం కూడా జరిగింది

వీరేశలింగంపంతులు, గురజాడవంటి ఆంధ్ర మహాపురుషులు పూర్వకవుల గుణదోషాలను నిష్పాక్షికంగా పరిశీలింప బూనుకొన్నప్పుడు విమర్శ కొత్తపుంతలు తొక్కింది కవిత్వతత్త్వ విచారము' 'నేటి కాలపు కవిత్వము' తెలుగువిమర్శ ప్రస్థానంలో మైలురాళ్లుగా నిలి చాయి. ఒక్కసారి వెనుదిరిగి చూసుకుంటే తెలుగు సాహిత్య విమర్శ అవతరణ–వికాసములు ఎవరైనా వివరించవలసిన అవసరం తప్పక ఉన్నదనిపిస్తుంది. సాహిత్య విమర్శ తెలుగులో యింకా అతిశయోక్తు లతో కూడిన పొగడ్తలతోనూ, గిట్టనివారిని ఏవగించుకొని, రంధ్రా న్వేషణా దృష్టిని సారించడంలోనూ నిలిచిపోయి వుండటం బాధాకర మనిపిస్తుంది.

మనకింతవరకూ ఉన్న సద్విమర్శకుల శక్తియుక్తులను అర్థం చేసుకొని, వారిలో ఉన్న లోపాలను బలహీనతలను విడిచిపెట్టి విమర్శ అంటే 'గుణదోష విచారము' అనే స్థిర నమ్మకాన్ని చదువరులకు

కలిగించడం ఆధునిక విమర్శకుల అవశ్య కర్తవ్యం. డాక్టర్ ఎస్. వి రామారావుగారు 'తెలుగులో సాహిత్య విమర్శ' అని పి. హెచ్ డి. పట్టమునకు పాత్రమైన సిద్ధాంత గ్రంథమున విమర్శ అవతరణ వికాసములను సవివరంగా పేర్కొన్నారు.

'విమర్శనము—విమర్శకుడు' అనే మొదటి ప్రకరణము ప్రౌఢగా పాతధోరణిలో '' 'మృశ్' ధాతువునకు 'వి' అను ఉపసర్గ చేరగా విమర్శ శబ్ద మేర్పడుచున్నది'' అని విద్యార్థులు 'కాంపోజిషన్' రాసే ధోరణిలో మొదలుపెట్టారు. విమర్శనమనగా బుద్ధి వ్యాపారము' అని చెప్పటంతో విమర్శ ఒకకళ' 'అది హృదయాన్ని అలరించేదిగా ఉండాలి' అన్న సత్యాన్ని బాగా గుర్తించినట్లు కనబడదు. కాని మూడవ పేజిలో విమర్శకుడు ''కవిసృష్టికి ముగ్ధుడై తాను కూడ భావనా జగత్తులో విహరించుచు ఆవేశపూరితాంతః కరణముతో విమర్శను వెలయించు'' నన్నారు దీనికి తార్కాణగా దేవులపల్లివారి ఏకాంతసేవ—పీఠికను, ఇంద్రగంటివారి 'వ్యాసావళి'ని పేర్కొన్నారు కాని కవిసృష్టికి ముగ్ధుడు కాకపోయినా విమర్శకుడు విమర్శను కళాత్మకంగా వెలయించవచ్చు కట్టమంచి రామలింగ రెడ్డిగారు ప్రబంధాలలోని కథ ఎలా ఉంటుందో వివరించేపట్ల 'కవిత్వతత్త్వ విచారము'లోని రచన జ్ఞప్తికి తెచ్చుకుంటే విమర్శకుడు కవిసృష్టికి ముగ్ధుడు కావటం అత్యవసరం కాదనిపిస్తుంది. సమదర్శనం, సత్య ప్రకటన ఉంటే విమర్శను కళగా రూపొందించవచ్చు.

పాశ్చాత్య విమర్శక సిద్ధాంతములను భారతీయ విమర్శ ప్రమాణాలతో సమన్వయం చేసి ''కావ్యమునందు భారతీయ విమర్శకులు రసము నన్వేషింపగా పాశ్చాత్యులు ఇతివృత్త నిర్మాణము పాత్రపోషణము పరిశీలింతురు. రసమున కాలంబనము కదా పాత్రములు ఇతివృత్త పాత్రముల ఆధారమున రసము పరిపోషింపబడును కావున, ఇరువురి మార్గములే వేఱుకాని, గమ్యమొక్కటే.'' డాక్టర్ ఎస్. వి. రామారావుగారి యీ సమన్వయం మెచ్చదగింది.

తెలుగులో సాహిత్య విమర్శ 'పూర్వయుగము' అనే ప్రకరణంలో సత్యభాంతర పరిశీలనములను, కవులు గ్రంథాలలో వెల్లడించిన పూర్వకవి స్తుతులలోను, కుకవి నిందలలోను వెలువరించిన అభిప్రాయాలను క్లుప్తంగా తెలిపారు. కవి హృదయాన్ని స్పష్టంగా గ్రహించటానికి టీకారచన లెంతగానో తోడ్పడుతున్నాయి. ''ఆంధ్రమున టీకా రచన 16 వ శతాబ్దినుండి ఆరంభమైనట్లు గోచరించుచున్నది. వీరిలో ప్రాచీనమైనది ముద్దరాజు పెదరామన (1575) రాఘవ పాండవీయమునకు రచించిన ఆదర్శవ్యాఖ్య'' చదువరులు యీ సమాచారాన్ని గ్రహించి ఎస్. వి. రామారావుగారి కృషిని ప్రశంసించగలరు. తెలుగు లక్షణ గ్రంథాలు ''ప్రధానంగా సంస్కృతాలంకార శాస్త్రాలనే అనుసరించటంచేత ప్రత్యేకంగా తెలుగు లక్షణ గ్రంథాలు తెలుగుకావ్య విమర్శలో వానికంతగా ప్రాధాన్యము లేద''న్న వీరి సూచన గమనించదగ్గది. ''వ్యాఖ్యలయందు మాత్రము కొంత విమర్శ కన్పట్టుచున్నను అవికూడ కేవల టీకారూపములై, కవిత్వ సౌందర్య చర్చకు తావివ్వక కవి హృదయ ప్రకాశకములు కాకున్నవి'' అన్న వీరి మాటలు మెచ్చదగినవి ఏ పద్యానికాపద్యానికే భావాన్ని వివరించుకుంటూ పోవటమేగాని కావ్యములోని ఏకవాక్యతను, కవి లక్ష్యాన్ని, అది ఎంతవరకు నెరవేరిందన్న విషయాన్ని వ్యాఖ్యాత లంతగా పట్టించుకోలేదు. అది వ్యాఖ్యాతల దృష్టి కాదు కూడాను. వ్యాఖ్యాతల వ్యాఖ్యలలోని ంగాలోపాన్ని సవ్య విమర్శలెంతవరకు తీర్చి యున్నది సందేహాస్పదమే. అయినా కావ్య సౌందర్యాన్ని ఉపదేశాన్ని పొందదలచినవారికి వ్యాఖ్యాతల రచనలు తృప్తినివ్వకపోవటం చేతనే 'వసుచరిత్ర' వంటి గ్రంథాలకు వ్యాఖ్యలు వచ్చినా, 'వసుచరిత్రము—విమర్శకుడు', వసుచరిత్ర విమర్శనమువంటి గ్రంథా లవసరమౌతున్నాయి.

ఆధునికాంధ్ర విమర్శల అవతరణకు పత్రికల తోడ్పాటును రామారావుగారు శ్రద్ధగా పరిశీలించారు. సాహిత్య విమర్శకు తోడ్పడిన కావలి రామస్వామి, సి. పి. బ్రౌన్, జూలూరి అప్పయ్యశాస్త్రిగారల కృషిని మరీ క్లుప్తంగా వివరించారు ప్రథమాంధ్ర విమర్శకునిగా శ్రీ వీరేశలింగం పంతులుగారిని గుర్తించి గౌరవించటం రామారావుగారు ఈ పుస్తకంలో చేసిన అత్యుత్తమమైనపని. తెలుగు సాహితీ

సుక్షేత్రమునందు విమర్శన స్రవంతిని అవతరింపజేసిన భగీరథుడు కందుకూరి వీరేశలింగంపంతులు. తొలి తెలుగు విమర్శనా గ్రంథమును వెలయించిన కీర్తిమూర్తి ఆయన. పంతులుగారు రచించిన 'విగ్రహ తంత్ర విమర్శనము' 1875–76 లో వివేక వర్ధని పత్రికయందు వెలువడినది. ఆంధ్రవాఙ్మయమున వెలసిన ప్రప్రథమ సాహిత్య విమర్శనా గ్రంథమిదియే" రామారావుగారి పరిశోధనా కృషివలన వెల్లడియైన ఈ సత్యాన్ని పండితులు తర్జన భర్జనలు లేకుండా అంగీకరిస్తారేమో వేచి చూడాలి.

వీరేశలింగం పంతులుగారి తరువాత చెప్పదగిన విమర్శకులు వేదము వేంకటరాయశాస్త్రిగారే. ఆంధ్రపల్లి నాథులని కీర్తిగడించిన వారికృషి అపారమైనది. ఆయన పడిన పొరపాట్లను, అసంఖ్యాకంగా తరువాత పండితులు ఆక్షేపించారు. అయినప్పటికీ "దేశక్షేమమునకు భాషాక్షేమము పునాది"గా భావించిన ఆ మహనీయుడు సలిపిన సారస్వత యుద్ధాలు స్మరింపదగినవి. ఎస్. వి. రామారావుగారు ఈ సారస్వత యుద్ధాలను స్మరణ మాత్రంగానే పేర్కొన్నారు. బహుశా స్థలాభావంవల్లనేమో. పరిశోధనా గ్రంథాలు స్థలాభావాన్ని లక్ష్య పెట్టటంకంటె సారస్వత మథనంచేసి సత్యాన్ని వెలికితీయటమే మంచిది. 'విమర్శకాగ్రేసరులు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి విమర్శలకు కాలదోషం పట్టినా విమర్శ చరిత్ర రాసేవారికి పేరు స్మరించటం తప్పనిసరి. రామారావుగారు బ్రహ్మయ్యశాస్త్రిగారి కృషిని ప్రస్తావించి విడిచిపెట్టేశారు" గురజాడ అప్పారావుగారు ప్రత్యేకముగా విమర్శన గ్రంథములు రచింపకపోయినను ఆయన రచనలన్నింటియందును సాహిత్యవిమర్శ అంతర్భూతమైయున్నది." రామారావుగారు గురజాడ కృషిని ఈ రంగంలో విస్మరించక చక్కగా గుర్తించారు. ఇంకా పూండ్ల రామకృష్ణయ్య, కొక్కొండ మొదలైనవారి కృషిని గూడ దిఙ్మాత్రంగా సూచించారు.

'వికాసము' అనే భాగంలో కట్టమంచి రామలింగారెడ్డిగారి విమర్శ గ్రంథంలోని ప్రత్యేకతను నొక్కి వక్కాణించారు. సలక్షణమై సుబోధకమైన భాషలో మొగమాటములేక సూటిగా వ్రాయుట రెడ్డిగారి ప్రత్యేకత. కావ్యరచనలో విశ్వనాథ సత్యనారాయణగారికొక ప్రత్యేకశైలి ఉన్నట్లే విమర్శప్రక్రియలోను విశ్వనాథ బాణీ ఎటువంటిదో రామారావుగారు ప్రశంసాపూర్వకంగా వివరించారు. సుమారు 18 పేజీలలో సోదాహరణంగా విశ్వనాథవారి గొప్పతనాన్ని మాత్రమే నిరూపిస్తూ రామారావుగారు రచన సాగించారు. కందుకూరి, కట్టమంచి, వేదం మొదలైన వారికిచ్చిన ప్రాధాన్యం కంటె రామారావుగారు విశ్వనాథవారికి విమర్శ రంగంలో ఎక్కువ ప్రాధాన్యమివ్వటం గమనించవలసిన విషయం.

విశ్వవిద్యాలయాలనుండి వెలవడిన సిద్ధాంత వ్యాసములను, పత్రికలలో వస్తున్న విమర్శ వ్యాసాలను రామారావుగారు పరిమితమైన వేగంతో కేవలం రచయితల, వ్యాసాలపేర్లు మాత్రం చెప్పుకుంటూ పోయారు. దీనివలన యీ భాగంలో రచన ( Descriptive catalogue ) వలె తయారైంది. 'సత్యదర్శనం, సమగ్రత్వం ఈ గ్రంథం ఆశయాలు" అని రచయిత అవతారికలో అన్నారు. గ్రంథంలో కొంతభాగం మరి (catalogue) లాగ తయారవటం వలన యిది అసమగ్ర మనక తప్పదు. ఆమాటకొస్తే ఏదీ సమగ్రంకాకపోవచ్చు. వివరణ సవిస్తరంగా సాగినపుడే రచయిత సత్యదర్శనం ఎటువంటిదో తెలుసుకోవటానికి వీలౌతుంది.

తెలుగులో సాహిత్య విమర్శ అభివృద్ధికి ఈ గ్రంథం తోడ్పడక పోయినా ఇంతవరకు వచ్చిన సాహిత్య విమర్శల స్వరూప స్వభావాలు కొంతవరకు బోధపడతాయి. కందుకూరి వారి విగ్రహతంత్ర విమర్శనము (1876) తెలుగులో తొలి విమర్శన గ్రంథమని వీరు పరిశోధనచేసి నూతనాంశాన్ని ప్రతిపాదిస్తున్నారు. ఇది యథార్థమని పండితులందరూ తల యూచినప్పుడు తెలుగు విమర్శ చరిత్రకు డాక్టర్. ఎస్. వి. రామారావుగారు దోహదం చేసిన వారవుతారు.

## బాబా ఫరీద్

[జీవిత చరిత్ర; ఇంగ్లీషు రచన : బల్వంతసింగ్ ఆనంద్; ప్రచురణ : సాహిత్య అకాడమీ– న్యూఢిల్లీ; 95 పేజీలు; వెల రూ. 2–50]

కేంద్ర సాహిత్య అకాడమీ 'భారతీయ సాహిత్య నిర్మాతలు' అనే వరుసలో ప్రకటిస్తున్న వాటిలో పంజాబుకు చెందిన బాబా ఫరీద్ అనే తాత్త్విక కవి జీవిత, సాహిత్య విశేషాలను వివరించే పుస్తకమిది. బాబా ఫరీద్ అష్టమ శతజయంతి 1973లో ఢిల్లీలో జరిగింది. ఆయన క్రీ. శ. 1173లో జన్మించి 1265లో మరణించారు. ఆయన గడపిన పవిత్ర జీవనంతోపాటు తాత్త్విక ప్రవచనాలు కూడ పంజాబులోనూ, ఉత్తర భారతదేశంలోని పలుప్రాంతాలలోను వ్యాపించి ప్రచారంలో ఉన్నాయి. ప్రసిద్ధ మతగురువు గురు

నానక్ బాబా ఫరీద్ ప్రవచనాలకు ముగ్ధుడై వాటిని భద్రపరచి ముందు తరాలవారికి అందజేశాడంటే ఫరీద్ గొప్పతనానికి వేరే నిదర్శనం అక్కరలేదు. బాబా ఫరీద్ వేమన, కబీర్ మొదలైన వారిలాగే తాత్త్విక చింతనతో నిండిన కవితలను రచించారు. ఫరీద్ కవితలు అరబ్బీ పర్షియన్ పంజాబీ భాషలలో రచించారు. ఆయన కవిత మార్మిక (mystic) పద్ధతిలో ఆలోచనా పరులకు చక్కిలిగిలి పెట్టేదిగా ఉంటుంది.

షేక్ ఫరీద్ ఉద్దీన్ గన్స్-ఇ షకర్ అనేది ఫరీద్ పూర్తి పేరు. ఆయన ఇస్లాం మతానుయాయి. ఇస్లాము మతంలోని మార్మిక పద్ధతి అనదగిన 'సూఫీ' పద్ధతిని ఆయన అనుసరించారు. పవిత్ర జీవన విధానమును సూఫీ పద్ధతిలో తప్పక అనుసరించవలసి ఉంటుంది.

సూఫ్ (suf) అంటే అరబ్బీ భాషలో ఉన్ని (wool) అని అర్థం. అరేబియాను, ఇరాక్‌లోను సన్యాసులు మామూలు బట్టలు కాక ఉన్ని వస్త్రాలను ధరించటంచేత 'సూఫీ' అనే పేరువచ్చింది. కొందరుమాత్రం సూఫీ అనే పదం 'సోఫాస్' అనే గ్రీక్ పదంనుంచి వచ్చిందంటారు. 'సోఫాస్' అంటే గ్రీకు భాషలో ఆధ్యాత్మిక నిధి అని అర్థమట.

క్రీ. శ ఏడవ శతాబ్దిలో పర్షియా ఇస్లాము ప్రభావానికి లోనైనది. అరబ్బీ-ఇస్లాము సంస్కృతులు; ఆర్యన్-ఇరానియన్ సంస్కృతుల సమ్మేళనకు ఫలితంగా సూఫీతత్త్వానికి విశేషమైన ప్రచారం జరిగింది-మహమ్మద్ గోరి క్రీ. శ. 1186లో టర్కీవారి సామ్రాజ్య స్థాపనకు, తదనంతరం సుల్తానుల పరిపాలన ఏర్పడేటందుకు దోహదం చేశాడు. ఆనాటి ఇస్లాము మతానుయాయులు సంస్కృతిపరంగా పర్షియన్ భాషను వాడేవారు. కాబూలునుండి భారతదేశానికివచ్చిన జమాలుద్దీన్‌కుమారుడు ఫరీద్ బాల్యంలో ఫరీద్ మహిమలను ప్రదర్శించినట్లు అనుయాయులు కొన్ని కథలను ప్రచారంలోకి తెచ్చారు.

ఖ్వాజా కుతుబ్ ఉద్దీన్ భక్తియార్ కాకి అనే ఆచార్యుని ప్రభావంతో ఫరీద్ సూఫీ తత్త్వంవైపు మొగ్గుచూపాడు. గురువు మరణం తరువాత కొన్నాళ్లకు ఫరీద్ ఢిల్లీలోని జీవితాన్ని, రాజకీయాలను రోసి అజోధాన్ (పాకిస్తాన్‌లో మాంట్‌గోమరీ జిల్లాలో ఉన్నది) పట్టణం వెలుపల చిన్న గుడిసె వేసుకొని జీవితం గడిపాడు. అక్కడే ఆయన వివాహం చేసుకొని పిల్లలతో, పెద్ద కుటుంబంతో, దారిద్ర్యభారంతో, భగవద్భక్తితో, కాలం గడిపాడు. దారిద్ర్యభారం ఆయన భక్తికేమీ అడ్డురాలేదు.

యోగుల భక్తి పద్ధతిని, బౌద్ధుల భిక్షాటనాన్ని, భక్తిమార్గపరులాచరించే సంగీత నృత్యాలను ఫరీద్ సూఫీ తత్త్వంలో ప్రవేశపెట్టాడు. కురాన్ చెప్పిన ధార్మికత (Charity)ను ఫరీద్ తన అనుయాయులకు బోధించాడు.

బాబా ఫరీద్ గీతాలు రెండు పాదాలలో స్వయంసంపూర్ణంగా ఉండే గీతాలలో ఉన్నాయి. కవిత్వాన్ని అనువదించటం కష్టసాధ్యం. అందులోనూ తాత్త్విక చింతన మార్మికపద్ధతిలో ఉండే అనువాదం కష్టతరమని వేరే చెప్పనవసరం లేదు. ఈ గ్రంథాన్ని రచించిన శ్రీ బల్వంత్‌సింగ్ ఆనంద్ ఫరీద్ జీవిత విశేషాలు ఆసక్తిదాయకంగా చెప్పటమేగాక, ఫరీద్ గీతాలను చక్కని ఇంగ్లీషు భాషలో గీతరూపంగా అనువదించి భారతదేశంలో ఇంగ్లీషు నేర్చిన అన్ని ప్రాంతాలవారికి అందుబాటులో ఉండేవిధంగా రచించారు. అన్ని రాష్ట్రాలలోని సాహిత్య నేతల రచనలను పండిత పామరులందరికీ అందుబాటులో ఉండే విధంగా రచింపజేస్తున్న సాహిత్య అకాడమీ ఢిల్లీవారి కృషి మెచ్చదగినది. శ్రీ బల్వంత్‌సింగ్ ఆనంద్ తమ బాధ్యతను చక్కగా నిర్వర్తించడమేగాక, ఫరీద్ కవితను చక్కని ఇంగ్లీషు భాషలో అనువదించి కవితాభిమానులకు ఆనందం కలిగించారు.

— శ్రీ రామమోహనరాయ్

## శ్రీమద్భాగవతము : దశమస్కంధము

[విద్వాన్ చదలువాడ జయరామశాస్త్రి విరచిత తత్త్వదర్శినీ వ్యాఖ్యా సమేతము. 1100 పేజీలు వెల రు 40/- బమ్మెర పోతరాజ పద్యానువాద సహితము ప్రతులకు :— చదలువాడ జయరామశాస్త్రి అండ్ సన్స్, నెల్లూరు.)

ఈ వ్యాఖ్యాత తమ పీఠికలో చెప్పుకొన్నట్లు ఉపనిషత్తులు వేదములను అధ్యయనముచేసి, కావ్యనాటకాదులను తరచిచూచి జగద్గురు శంకరాచార్యులు (కాంచీకామకోటి పీఠము అరవది వేదాంత) ఉపదేశమునుగూడ పొందియున్నారు. వీరు సంస్కృతభాగవతానికి

నం పూర్ణంగా తెనుగు అనువాదం నగియు విశేషింశాలుగల వ్యాఖ్య వ్రాయుటే గాక భీష్మస్తవరాజము, సనత్సుజాతీయము; దేవీ పంచస్తవి, సూర్యశతకము వరకు కూడ వ్యాఖ్యల చేసి ప్రకటించారు. ఇంకా ఎన్నో లోకహిత గ్రంథాలను ప్రచురించారని తెలుస్తున్నది.

ప్రస్తుతము ముద్రిత దశమ స్కంధ పూర్వభాగమునకై శ్రీ మారం రెడ్డి రామస్వామిరెడ్డిగారు ఔదార్యంతో 15 వేల రూపాయలు విరాళాన్నిచ్చారు.

దీనిలో సంస్కృత శ్లోకాలు 54 అధ్యాయాలు తెలుగుటీక, తాత్పర్యము విశేషార్థములతో వాని క్రింద పోతన పద్యానువాదము కూడ చేర్చబడివున్నది. తెలుగు సంస్కృత కావ్య వినోదులకు చాల ఆహ్లాదకరంగా వ్రాయబడింది.

దశమస్కంధమంతా శ్రీకృష్ణుని జన్మవృత్తాంతము, బాల కృష్ణలీలలు, రాసక్రీడ, గోపికా వస్త్రాపహరణము కాళీయమర్దనము కంసవధ మొదలగు ఘట్టాలు తొందరగా అందరికి జ్ఞప్తికి వస్తాయి. దీనిలో రుక్మిణీ కల్యాణము వరకు వున్నది. తెలుగు స్త్రీలలో ప్రతీతి యేమంటే రుక్మిణీ కల్యాణం చదివితే, ప్రతిరోజు పారాయణంచేస్తే అనురూపుడైన, అనుకూల పతి వస్తాడని. అలస నాటకం కంపెనీ వారు కృష్ణలీలలువేసి ప్రజలను ఎంతో మురిపించేవారు. శ్రీకృష్ణుడు చాలా మంచివాడని ఒకానొక నానుడి - రాముడు కఠినాత్ముడై భార్య సాధ్వి మహాశయురాలైనా కరకు గుండెతో ప్రజల అభిప్రాయానికిగాను అడవుల పాలుచేస్తే, కృష్ణుడు జరాసంధుని నరకుని చెరలో వుండే వేల కొలది కన్యలను పెండ్లిచేసుకొని ఉద్ధరించి స్త్రీపక్షపాతాన్ని చూపించాడని చలోక్తిగా.

శ్రీకృష్ణుడు నిజంగా గొప్ప రాజకీయవేత్త. తన తరువాత 3000 ఏండ్లకు చాణక్యుడు చేసినంత పనిని తనకాలంలో చేసి చూపించినాడు. చతురుపాయాలతో తనకాలపు చిన్నరాజ్యాలను ఏక ఛత్రాధిపత్యంకింద తెచ్చి సురాజ్యం చేయించాడు. మహాభారతం ఒక రాజకీయ తంత్రగ్రంధమేకదా ! భాగవతంలోకూడ దుష్టశిక్షణ శిష్టరక్షణ వ్రాయబడివుంది. మదించినవాడు దేవేంద్రుడైన, సముద్రుడైన బ్రహ్మదేవుడైన కృష్ణుడు విడిచిపెట్టడు. తన ఆశ్రితులను సత్పాత్రులను రక్షించి తీరుతాడు. కాళీయ మర్దనంలోనే భారతీయ రాజుల లక్షణం, భారతం అన్నీ ఇమిడి యున్నాయి కృష్ణుని వేణునాదం అప్పటికి ఇప్పటికీ మధురానగరంలో, కవులందరిలో ప్రతిధ్వనిస్తూనే వుంటుంది.

భాగవతంలోని ముఖ్య ఘట్టాలు తెలుగువారికి కంఠస్థంగానే వుంటాయి. గజేంద్రమోక్షం, ధ్రువ చరితము, కృష్ణలీలలు, గోపికా గీతాలు. రుక్మిణీ కళ్యాణము ఇంకాఎన్నో స్త్రీలకు కూడ సుపరిచితాలే. శ్రీకృష్ణుడు సాక్షాత్ పరమాత్ముడె అని భక్తుల విశ్వాసము.

"ఏష నారాయణ శ్రీమాన్ క్షీరార్ణవ నికేతనః॥
నాగపర్యంకము త్సృజ్యహ్యాగతో మధురాంపురీ॥
అని భక్తులు చెప్పుకుంటారు.

భాగవత ధర్మము చాల పురాతనమైంది. క్రీ. పూ. 6 వ శతాబ్దినుండే సంకర్షణ వాసుదేవతత్త్వము భారతదేశమంతటా ప్రచారానికి వచ్చింది. పతంజలి, పాణిని కూడ తమ ఉదాహరణాలలో వాసుదేవుని భగవత్స్వరూపుడని పేర్కొన్నారు. గుప్త చక్రవర్తులు పరమభాగవతులని తెలియవస్తున్నది. కృష్ణభక్తి అనూచానమైంది. శిలప్పధికారంలో కూడ కృష్ణభక్తి, భాగవత ధర్మం పేర్కొనబడింది. ఆళ్వార్లు, ఆచార్యులు కూడ ప్రస్థాన త్రయానికి సమానంగా భాగవతాన్ని అధ్యయనంచేసి తమ గీతాలలో, వ్యాఖ్యానాలలో పాంచరాత్రాన్ని భాగవతధర్మాన్ని, సాత్విక పద్ధతిని వైదిక ఆచారాలతో కలిపి కలగపులగంగా చొప్పించి ప్రచారం చేసినారు. దానివలన ద్రావిడదేశంలో కృష్ణభక్తి అతి లోతుగా పాతుకున్నది. వైష్ణవ గ్రంథాలలో వటపత్రశాయి; వామనావతారం, శ్రీ రామావతారం, కృష్ణావతారం, నరసింహావతారం మొదలగు వాటిపై కాంచీ శ్రీరంగం, వెంకటాద్రి, మేలుకోటలోని దైవాల వర్ణనలతోబాటు మంచి రసవంతమైన కవిత్వం వుంది.

ఆండాళ్ గోదాదేవి ఏర్పాటు చేసిన తిరుప్పావై (ధనుర్మాస) వ్రతం కూడ శ్రీ కృష్ణుని వాక్యానుసారమే ఏర్పడింది. 'మాసానాం మార్గశీర్షోస్మి'; గోపికలు అనాయకంగా కృష్ణునికి చేసిన ఆత్మ సమర్పణయే ఆండాళ్ యొక్క వరఫలంగా మారి వైష్ణవుల శరణాగతిగా మారిందనవచ్చును. భాగవత కథలలోని భక్తులందరూ శరణాగతిని చరమోపాయంగా వాడుకున్నవారే. తిరువాయ్‌మొళినిండా కృష్ణునిపై మంచి విరహ గీతాలున్నవి

శ్రీ శాస్త్రిగారు తమ ఉపోద్ఘాతంలోనే చెప్పవలసినదంతా చెప్పినారు.

భాగవతము 'నిగమ కల్పతరుగళితమైన ఫలము వ్యాసుడు వేదవిభాగం చేసి పురాణాలన్నీ వ్రాసి ధర్మాలను సిద్ధాంతీకరించినప్పటికీ మనశ్శాంతి కుదరలేదు

ఆ మహర్షికి కలియుగంలోని

'అలసులు మందబుద్ధి యుతులల్పతరాయువులుగ్ర రోగసం
కలితులు మందభాగ్యులు సుకర్మము లెయ్యవి సేయ జాలరీ
కలియుగమందు మానవులు గావున నెయ్యది సర్వసౌఖ్యమై
యలవడు నేమిటం బొడము నాత్మకు శాంతి మునీంద్ర చెప్పవే''

అని ప్రజలపై కరుణతో నారదునికి విన్నవించుకొంటే అతడు

'విష్ణుకథా రతుడగు నరు విష్ణుకథల్ సెప్ప
నరుని వినుచుండు నరున్
విష్ణుకథా సుప్రశ్నము, విష్ణునదీ జలము భంగి విమలున్
జేయున్.

అని సందేశమిచ్చి శమ్యా ప్రాసమనే ఆశ్రమంలో ఉపదేశిస్తే సిద్ధ వ్యాసుడు భాగవతాన్ని రచించి తన కుమారుడైన శుకునికి చెప్పితే అతడు పరీక్షిన్మహారాజుకు చెప్పితే ఆ కథనే సూతుడు శౌనకాది మహా మునులకు చెప్పి దేశవ్యాప్తంగా చెప్పించినాడు.

శాస్త్రిగారు భాగవతంలో బ్రహ్మవిద్య, వృత్రాసుర వధ, గాయత్రీవిద్య అనే ముఖ్య విద్యలున్నవని విష్ణుభక్తి ప్రాశస్త్యం గాయత్రీ విద్యద్వారా సిద్ధించుతుందని వ్రాశారు. ఈ లోకోపకృతికై వ్యాసుడు తనవంతును హరికీర్తనంతో తీర్చుకొని వ్రాసిన గ్రంథమే వైష్ణవులకు ఉపాదేయం అయింది. శాస్త్రిగారు భాగవతాన్ని మహాపురాణంగానే నిశ్చయించినారు.

దీనిలో సాధనమార్గం పూర్తిగా చూపబడింది.

'శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం'

రాసక్రీడా రహస్యం ప్రేమభక్తికి ఉత్తమోత్తమ ప్రారము. జయదేవుడు, రూపగోస్వామి మధురభక్తి మాహాత్మ్యాన్ని ఎంతో రసవంతంగా చాటినారు.

ఈ గ్రంథం సంస్కృతం విశేషంగా అభ్యసించే విద్యార్థులకు శ్లోకం అర్థం త్వరగా అర్థమయి భాగవత ప్రయోగాలు బోధపడి ఎంతో లాభిస్తుంది.

శాస్త్రిగారి ఓపికను, విద్వత్తును అభినందించక తప్పదు.

## తాళ్లపాకవారి పలుకుబళ్లు

(సంపాదకురాలు : శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర; ప్రతులకు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్–హైదరాబాదు 4 సుమారు 570 పేజీలు వెల : రూ॥ 12)

తెలుగు వాగ్గేయకారులు భక్తితోపాటు ఇతర రసములను కూడ చక్కగా ఇమిడ్చి పాడారు. త్యాగయ్య, క్షేత్రయ్య అన్నమయ్య తదితరులు ఈ కోవకు చెందినవారే ఆపదల మొక్కులు తీర్చే శ్రీనివాసుడు మన రాష్ట్రంలో వెలసియుండి మనవారి విశేష సమన్వయ దృష్టికి తార్కాణంగా అందరినీ రప్పించుతున్నాడు. అన్ని నాగరికతలకు ఆలవాలమైనాడు. ఎందరెందరో వెంకటేశుని వినుతించినా తాళ్లపాక వారివలె సులువుగ; పొంకంగా, బింకంగా పదములతో అలమేలు మంగపతిని అర్చించినవారు అరుదనవచ్చును. పదసాహిత్యాన్ని బహుజనరంజకంగా చేసింది బహుశః వారి కుటుంబమే అని విజ్ఞుల విశ్వాసము. శ్రీమతి రామలక్ష్మిగారు ఈ పదములను పరిశోధించి కూర్చి పదకోశము వ్రాయించడానికి పూనుకొనుట కూడ పుణ్యకార్యమే. (వారివంటివారు పుణ్యపాపాలను నమ్మకపోని!)

ప్రస్తావనలోను, మనవి మాటలలోను ఈ పదకోశమును గురించి తగినంత పరిచయ మేర్పడుతుంది. ప్రస్తావన వ్రాసిన శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు స్వయముగ తాళ్లపాకవారి తామ్రపత్రముల పైననే పరిశోధనలను చేసి రాగములు వేసి పదముల బహుళ ప్రచారానికి అనువుగ చేసిన వారిలో ప్రముఖులు దేవస్థానము వారు తాళ్లపాకవారి కృతుల నన్నిటిని త్వరలో ప్రచురించాలనే శ్రీ రాళ్లపల్లి వారి అభిలాషతో నేను ఏకీభవిస్తున్నాను. పదముల "ఓజస్సు జస్సులు, రసధార, భావవైవిధ్యాలూ, ఈ పదకోశములో ఏర్చికూర్చిన వాటినుండి కూడ మచ్చుకు మనకు బోధపడుతాయి

రచయిత్రి తాళ్లపాకవారి రచనలలో 'సామెతలు జాతీయాలు క్రొత్త పద ప్రయోగాలు పర్యాయ పదాలు, ఆభరణాలు వంటకాలు ఇంకా ఎన్నో చేర్చినారు.' శబ్దం, అర్థం, తాత్పర్యం, వాక్య

వ్యాకరణం; జాతీయం, దేశీయం, సంగీతం, శృంగారం, పదరచన పరిణామం, సంకీర్తన, భక్తి, తత్త్వం, సమకాలపు సంఘ చరిత్ర నీడలు అన్నీ ఇందులో శోధించి తీయవచ్చు.

శ్రీమతి రామలక్ష్మి కోరికలు (సారస్వత సేవలో) కొండంతలే సమగ్రమైన నిఘంటువూ, సంపూర్ణమైన వ్యాకరణమూ, సలక్షణమైన ఛందశ్శాస్త్రము, లాక్షణిక గ్రంథాలు మరెన్నో అముద్రితాలు ముద్రితం కావాలి. ఆమె పేర్కొన్నట్లే తాళ్లపాక వారిది సుప్రసిద్ధమైన సాహిత్య కుటుంబం. మధుర కవితలతోనూ, లాక్షణిక జ్ఞానంతోనూ వారు తెలుగు సాహిత్యాన్ని సంపన్నం చేశారు ఆ కుటుంబంలోని పదిమంది రచయితలు స్త్రీలు పురుషులుగూడ అసంఖ్యాకమైన సంకీర్తనలేకాక ద్విపద కావ్యాలు, శతకాలు, ఇతర పద్య గ్రంథాలు చెప్పినట్లు పరిశోధనలవల్ల తెలుస్తూంది. వారి రచనలలో తత్సమ పదాలకన్న దేశ్యాలు, విశిష్ట గ్రామ్యాలూ చాలావున్నాయి; ఎన్నో అపూర్వ ప్రయోగాలున్నాయి ఇతర భాషలుకూడా సంకీర్తనలో వాడవచ్చున్నారు. 'ఉచిత భాషపదముల జెల్లు' అని వారి వాదము, సమభావానికి పోది పెడుతుంది.

ఇప్పటికి తెలియవచ్చిన సుప్రసిద్ధ తాళ్లపాకీయులు అన్నమయ్య, తిమ్మక్క, పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్య, పెద తిరువేంగళాచార్యులు, చిన్నన్న, తిరువేంగళప్ప, శ్రీనివాసుడు. మనవి మాటలలో శ్రీమతి రామలక్ష్మిగారు ఈ రచయితల రచనలను సవివరంగా వ్రాశారు.

మొత్తం 6279 సంకీర్తనలు తాళ్లపాకవారు వ్రాశారు. పెద తిరుమలయ్యగారు 'రేఫఱకారములను ఎలా ప్రయోగించారో చూపడానికి 108 కంద పద్యాలలో శకట రేఫలను చక్కగా వింగడించారు. వీరి అధ్యక్షత క్రిందనే కీర్తనలు చాలవరకు రాగిరేకులకు ఎక్కించారు. వీరు వ్యాకృతం, అవ్యాకృతం అనే భేదం లేకుండా అన్ని ప్రయోగాలు అందంగా చేశారు. శ్రీమతి రామలక్ష్మి కృషి తొలియత్నం ఐనా ఇతర పరిశోధకుల మార్గదర్శిగా పనిచేస్తున్నదంటే ఏమి సాహసంకాదు.

ఈ పదకోశంలో రెండు పెద్దఖండాలున్నవి.

1. సామెతలు, జాతీయాలు 2. పలుకుబళ్ల ప్రయోగాలు వీటికి అనుబంధంగా అర్చన, అస్త్రాలు; ఆటలు, ఆసనాలు-బాసలు, ఆభరణాలు-అలంకారాలు; ఆయుధాలు; ఓడినవారి విధులు, కనుమలు, కాకత్తీయలు, కులాలు, జాతులు కోటలు గృహం-గృహోపకరణాలు, చెట్లు పూలు, జంతువులు, జమిలిమాటలు ధనమానం-కొలమానం, నవరత్నాలు; నవ్వులు, నోములు-పండగలు, పదాలు; బేరాలు, భక్తి భేదాలు; రథాలు-భాగాలు, వంటకాలు, వసంతాలు; వాద్యాలు వివాహ విధులు, వ్యవసాయక పదాలు; సుగంధద్రవ్యాలు, స్త్రీ పర్యాయాలు, స్థలనామాలు అని 33 శీర్షికల కింద పదజాలము వ్రాయబడినది. ఇవన్నీ రాయలయుగము తరువాతి వెంకటపతిరాయల యుగంలోని వైభవాలను జనసామాన్యం తీరుతెన్నులు, వెంకటేశ్వరుని భోగాలను ఒకేమారు ఆకళింపు చేసుకోడానికి ఎంతో తోడ్పడుతాయి మరీ కఠినమైన పదాలకు అర్థాలను వ్రాసివుంటే ఇంకా బాగుండెడిదేమో! వ్రాసినంతవరకు తాళ్లపాకవారి రచనల సంఖ్యలను వ్రాశారు. మనవి మాటలలో వానికి కృతియొక్క పేరు దొరుకుతుంది.

మచ్చుకైనా కొన్ని శీర్షికలు; శృంగారం; నీతి, భక్తి, దేశీయాలు, ఇతరభాషలనుండి గ్రహింపబడిన మాటలను వ్రాయకుంటే చదువరుల కుతూహలం తీరదు.

ఇవి గ్రాంథిక భాషలలో వ్రాసి పాడిన పదాలయినా ఇప్పటి కొందరి వ్యావహారికం కంటే సులువుగానె అర్థమవుతున్నవి. అనేక మాండలిక పదాలున్నా అన్నీ అందంగా పొందుపరుపబడినాయి.

సమ్మాళిగె, మూడువుట్టగ వగైరా పదాలు తమిళచ్ఛాయలు గలిగివున్నాయి, సరపణులు, అప్పణవిడెం, సిరిసింగసవత్తి, ఒరటు; గరడి, బగ్గస, బుడిబుడి వగైరా కన్నడ పోలికలను గలిగియున్నవి. పారుపత్తెము, బీరకాయచిక్కు, బద్దు; నాముతెక్కు, రొప్పు, తీడు; నమ్రు. అడలు, బేసబెల్లి; మిట్టిపడు, మునిమాపు, పగరించి మొదగునవి దేశియపదములు. లకిమి కన్నడపదం అందంగావుంది— పురందరదాసు 'ఏనుధన్యళో లకుమి–ఎంథభాగ్యమో' అని లక్ష్మీదేవి సౌభాగ్యాన్ని కీర్తించాడు. రాయలసీమవారి మాండలికాలే ఎక్కువగా కనబడినా ఈ పదాలలో ప్రయత్నపూర్వకంగా ఆంధ్రదేశంలోని, మరీ చెప్పాలంటే తెలుగువారెవరైనాసరే, వాళ్ల జాతీయాలను మాండలికాలను చక్కగా ఏరికోరి తాళ్లపాకవారే పొందుపరచినట్లు తోస్తున్నది. అందువల్లనే అందాలన్నీ చిందుతుండే పదాలు వ్రాయగలిగారు.

కొన్ని చక్కని ఉదాహరణలు ఇస్తే బాగుంటుంది. శృంగారానికి కొన్ని ఉదాహరణాలిస్తాను

భక్తుడే ఒక శృంగారనాయికగా భావించి విరహం, సంభోగం రెండింటినీ చక్కగా వర్ణిస్తాడు. స్త్రీవర్ణన చూడండి. అంగడికెత్తి పెట్టి దివ్వెలంగన ముఖాంబుజాలు ముంగిటి పసిడి కుంభములు ముదల కుచయుగాలు, అలవి మీటిన ముత్తెంబుల నొక్కకొలికిక్కి,దెచ్చు నీకొమ్మ పర్వరుస, పూచిన తంగేడువలెనొలతి నిలుచున్నది కూచుండు మనరాదా కోరి నీవద్ద - వనిత జూఫులు కలువల వసంతము, ఘనమైన మోహము గంధము వసంతము, మనసులో కోరికలు మంచినీళ్ల వసంతము,వులిసి చన్నులు నొత్తి పూరడించ జూచితేను, యవె పిడిగుండ్లయితేనేమి సేతును.

మృదువైన తరుణుల మెఱుగు బాహులతలు, పొదలెల్ల దూరి పుంగడుగవయ్యేడయ్యా, పొలతులనెడి మహాభూతాలు సోకిన, తల మోఁలు విడిచి తల్లైయున్నారు - బెండువంటివారము, మా బిగువేటి బిగువు అని భక్తుడు అధైర్యాన్ని ప్రకటిస్తాడు. సంభోగ విహారాలను కూడ చూద్దాం.

శృంగార నాయక వెంకటేశ్వరుని వేడుకొనే విధం :

గుట్టున నా చన్నులు నీకు మీదెత్తినవే కావా
బెట్టుగా నెనగి చేతబట్టేవు గాక
ముసిముసి నవ్వుల ముంగారు ముంపులు
వసివాడు జెమట వానలు

అవలు చూపి మాటాడి ఆసపెట్టి సన్నచేసి
బేసవెల్లి తనమున బెనగేవవునే
కానుకలందే వాడవు గక్కన సన్నంటరాదా
పానికుచముల నిమ్మపండ్ల దానను.
'నాము లెక్కబంతములు నావిసేయనిక నేల
కై మీకినందు కతని కౌగలించుకొనవే

యేమిటికే బిగువు యింకానా తగవు'
అని నాయకురాలిని సిద్ధపరుస్తుంది.

ఎక్కువ అనురాగం, వ్యామోహంగల ప్రియురాలైన నాయిక మృదుహాస్యం ఎలా చేస్తుందో చూడండి.

'సెలవుల నవ్వితేనే చెరగు పట్టేవు నీవు
యెలమి నాలనైతే యెంత సేతువో!' అని
తమిరేచగా వలపు దైలవారగా నవ్వి
సమరతికి పెనగ సమ్మతించవయ్యా!
ప్రార్థిస్తుంది నాయిక.

నాయకుడు ఆరాటంలో—

'ప్రేమపు నీ యధరమే పెట్టరాని జీతము
కోమలి నీ తమ్మలమే కొంగుభత్యం'
అని బతిమాలుతాడు.

విరహం కూడ చూద్దాం.
మగవాడు బెనకగా మాటలాడ కుండితేను
మగువా అది రొమ్మున గుంపటే గాక—
నిండుకొన్న విరహాన నిన్నటినుండి

వండకండ నట్టాయ వలచిన వాఁ పెళ్లి
గుండె రాయిచేసుకుంటే గొరస నేమున్నది.

నా పిరుదులు యిసుక దిబ్బలంటూ
రంతులుగా నడునేల రాపు సేసేరే
వెదకు తానే నిన్ను వెలదికాకల బొందె
యెదుటి పొద్దు పొడువు కెండ కెంగ గా సేను.

భక్తికి ఎక్కడ చూచినా ఉదాహరణాలున్నవి :—

హరి గొలువని కొలువులు

అడవి గాసిన వెన్నెలలు
నీవె చేసిన చేతలు—కడుగగ నేటికి
సెంగిలి బూరెల గడుగగ నేల

విరుకే జ్ఞానం, మరపే సమాధి
హరి నీకు నిచ్చునట అనుమానమేల
తెరలు ఏనుగు నెక్కి దిడ్డి దాపేర
శ్రీపతి ఈతడుండగా జిక్కినవారిని నమ్మట
తీపని మీసాలమీది తేనె నాకుడి నుండి,
నెట్టన శ్రీ వెంకటాద్రి నిలయు డారగించని
మట్టులేక వడ్డించరో మంచి యారగింపులు.
దాసవర్గముకెల్లా దరిదాపు మీరె—కానవాసికి నెక్కించరాదా—
శాశ్వత హరి ని శరణ మను
పరమాత్మ డేలకుంటే బంధములు గలవా
తెరదీసి నట్లానె తెలుగక'
ఇలసంధకాపురపుటింటిలో నొక దీపెమెత్తి మెఱసినట్లు
వొలసి శ్రీ వెంకటపతి శరణాగతి వొకటే నాకు
భక్తికి వైరాగ్యానికి పుదాహరణలు కోకొల్లలుగా లభిస్తాయి,
కొన్ని సామెతలను—సమాజపు నీతులను చూద్దాం.
కన్నెరుగ కున్న కడుపెరుగు
కూడు వండుట గంజికొరకా తనకు
వేడుకలోగల సుఖము వెదకుటె నాక
గుగ్గిళ్లకు గొన్న గుఱ్ఱాలు అగడ్తలు దాటునా
పుల్లిధిన్న కోమటి వూరక వున్నట్లు
జల్లెడ నావాలు జారిపోయినట్లు
విలమి పతి వత నెవ్వడు వెనకు
వెదలంటునే నిప్పు సీమలోన
పతిలేని వారికి జరిగినదేయూరు
కుతదీరుటకు రచ్చకట్టయే యిల్లు
వాదమేల సారెసారెవడి ముక్తి తీదంద
వేదాంత శ్రవణము వెట్టికి చేసేరా?
గోవిందనామమొకటే కూడపోసే బుణ్యములు,
వేవేలు నామములకు వెలలున్నవా?
శ్రేమము లేనిమాట పెదవి పైన పులడు
కమ్మరి ముల్లుతీసి కొఱ్ఱు మొత్తినట్లాయెను
నెట్టి చెఱకు పోలిక వెదురు నమిలినట్లు
వెదక నేటికి నేయి వెన్న చేతబట్టుకొని
అడవి బడినవాడు వెడలి చోటులేక
తొడరి కంపలకింద దూరినట్లు
ఆకటివానికి అన్నమె బ్రహ్మము
లోకము బ్రహ్మము లోలునికి
కంటే సుంకము కానకుంటే బింకము
తీపు పిప్పిలోన గలదా?
పిండియెంతో నిప్పటియంతే
భక్తుడు పురుషకారిగా లక్ష్మిని వేడుకుంటాడు.
దేవులమ్మ యిందిర మాదిక్కై
విన్నవించరాదా శ్రీ వెంకటపతికి చిత్తమందగను
హాస్యంగా భక్తుడు వటపత్రశాయిని వర్ణిస్తాడు.
నడ్డిముక్కుతోడ వెఱ్ఱి నవ్వులు నవ్వినవాడు
అడ్డపీపడ్డైయున్న ఆకులమీది వాడు
అడరి పుత్తమురాలి నగ్గిబొసగొన్నవాడు
వడిబెట్టి మేనమామ చంపినవాడు
రామ, కృష్ణులను నిందిస్తాడు అన్నమయ్య

చివరకు తాళ్లపాకవారు

విరినిగానేమైనా వేడుదుము నుతింతుము
శరణు జొచ్చితిమిక క్షమియించు కొనవే

అని భరసమర్పణ చేసుకున్నారు.

ఇది పాఠకులకు పుల్లాసిన్నిచ్చే గ్రంథరాజము. సాహిత్య అకాడమీ ఆంధ్ర సారస్వతానికి నిష్పక్ష పాతంగా ఇతోధికంగా కృషి చేయుగాక —

## భారతీయ మహనీయులు

(ప్రచురణ విభాగం. రేడియో సమాచార మంత్రిత్వశాఖ. భారత ప్రభుత్వం, ప్రథమసంపుటం. వెల : 2-00 పేజీలు 112, తృతీయ సంపుటం వెల: 2-25 పేజీలు 144).

ఇవి హిందీమూలానికి అనువాదాలు. ప్రథమ సంపుటంలో మహావీరుడు, బుద్ధుడు, పాణినిపురు, చాణక్య, చంద్రగుప్తమౌర్య, అశోక, విష్ణుశర్మ, ఆర్యభట, నగార్జున, సముద్రగుప్త, కుమార

జీవ చంద్రగుప్త విక్రమాదిత్య, కాళిదాసు, హర్షవర్ధన, రెండవ పులికేశి శంకరాచార్య, ఆండాళ్, రాజరాజచోళుల గురించి వ్యాసాలు; తృతీయ సంపుటంలో అక్బరు, తోడర్‌మల్, మహారాణా ప్రతాప్, తాన్‌సేన్, చాంద్‌బీబి, సమర్థరామదాసు, సంత్ తుకారాం, శివాజీ, నానాఫడ్నవీస్, అహల్యాబాయి, టిప్పుసుల్తాన్, త్యాగరాజ రాజారామ మోహనరాయ్, మహారాజా రణజీత్ సింగ్, మీర్జా గాలిబ్, స్వాతి తిరునాళ్, తాంతియాటోపే, లక్ష్మీబాయి, నానాసాహెబు, సయ్యద్ అహమద్‌ఖాన్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, మైకేల్ మధుసూదన దత్తు, దయానంద సరస్వతి అను వ్యాసము బాలురకు అత్యంత ఉపయోగకరంగా వుండాలనే అభిప్రాయంతో ప్రచురించబడ్డాయి. ఇవి జాతీయ సమైక్యతకు దోహదం చేస్తున్నాయి. దానికితోడు ఆ పురుషుల చిత్రాలు కూడ వున్నందువలన బాలురకు కొంత ఉత్సాహాన్ని కల్గిస్తున్నాయి.

ప్రథమ సంపుటమైనా, తృతీయ సంపుటమైనా చారిత్రక ప్రసిద్ధవీరులనేచి తీస్తున్నందుకు చాలవరకు హిందీనామడినిలనుసరించి అనువదింపబడటం మూలాన కథలు సాధారణంగాను అక్కడక్కడ క్లిష్టంగానే సాగుతాయి అంటే తప్పులేదు.

ప్రథమ సంపుటంవలన మహావీరుని బాల్యజీవనం స్వభావం అంతా చక్కగా బోధపడతాయి. మహావీరునికి గిట్టనివారు ఆయన బోధలను వినవైరి సరిగదా కుక్కల నుసికొల్పి కత్తులు కటార్లతో రాళ్ళు రప్పలతో ఎదుర్కొని బాధించి అతని కండలను కాకులకు గద్దలకు వేసిరట. మహావీరుడు అన్నీ సహించి తన 'పంచాను వ్రతం' బోధించి జయించాడంటే హర్షణీయమే

గృహస్థులు కూడ హింసచేయరాదు అబద్ధమాడరాదు, అబద్ధాలను ప్రేరేపించరాదు, చౌర్యమునకు పాల్పడరాదు, ఏకపత్నీ వ్రతము అవలంబించాలి, కోరికలకు సంకెళ్లను బిగించాల అను నియమములు ఎంత తేలికో అంత కఠినమైనవి.

'నందవంశరాజులు, చంద్రగుప్తమౌర్యుడు జైనమతవ్యాప్తికి తోటుపడిరి' ఈ వాక్యము అక్షరాల నిజము కాదేమో! బుద్ధుని జీవిత చరిత్ర అందరికీ కరతలామలకము. బౌద్ధం ప్రపంచమంతా వ్యాపించి భారతీయతను ఆసియా, ఆఫ్రికా, ఇంకా ఎన్నో దేశాలకు కొనిపోయి ఆయా దేశాలోని తరువాతి మతాలలో ఇమిడిపోయిందనవచ్చును.

పాణిని విషయము చక్కగా వివరింపబడింది. విద్యార్థులకేకాక అందరికీ లాభదాయకమే పురు (పురుషోత్తముని) చరిత్ర తను గూర్చి బహుశః ఇంగ్లీషువారి రచనతో మెరుగనిపిస్తుంది. చాణుక్యుని విషయములో ఇక్కడ వ్రాసిన దానికంటే కాటూరి వెంకటేశ్వరరావుగారి ముగురు మూర్తులను అనువాదమే చాల రసవంతంగా వుందని చెప్పవచ్చును. ఇందులో ధననందుడు చాణక్యుని తన దర్బారుకు పిలిపించి గ్రహించినట్లు వ్రాశారు. భోజనము చేయుచోటుల్లో అగ్రాసనానికి గానే చాణక్యుడు అవమానం చెందినట్లు, గెంటివేయబడినట్లు సంస్కృత సాహిత్యం వ్రాస్తున్నది చారిత్రకులు నిజం తేల్చాలి.

చాణక్యుడు, అతని అడుగుజాడలలో నడచిన చంద్రగుప్త మౌర్యుని పరిపాలనా విధానం వల్లనే భారతదేశం "కచ్ఛత్రాధిపత్యము క్రిందవచ్చి సుసంపన్నమయ్యెనని చెప్పవచ్చును. అశోకుని ధర్మయాత్రలు బాగానే వర్ణింపబడ్డాయి. మొదట్లో పంచతంత్రము కథలన్నియు మనసుసులా నపరచుటకు 'స్త్రాతనే ఉద్దేశించినవి' అని వ్రాసి మళ్ళీ 'ఈ కథల ద్వారా వారికి నీతియొక్క మూలసిద్ధాంతములు ఎరుకపరుపబడినవి' అని వ్రాయడం ఏమి బాగాలేదు 'హిందూధర్మశాస్త్రములలో ఇహలోకముకంటె ఎక్కువగా పరలోకమున కెక్కువ ప్రాధాన్యత యివ్వబడింది అనడం రచయిత చక్కగా వ్రాయలేదని తెల్పుతుంది.

'ఆర్యభట్టు' అనుటకు మారు అతనిపేరు 'ఆర్యభట' కాబట్టి సవరించాలి. ఇతని గొప్పదనాన్ని నేటి భారతీయ శాస్త్రజ్ఞులు గుర్తించి ఉపగ్రహానికి నామకరణం చేసి సార్థకం చేశారు.

ఈపుస్తకంలో వ్రాసినట్లు నాగార్జునుడే బౌద్ధమత హిందువులు పూజించు విగ్రహ మూర్తులను ఆయా దేవతలకు పూజలను అనుమతించేవుంటే ఇతని వాదాన్ని తెగవాడి ఇతని వాదాలతోనే బౌద్ధాన్ని పారద్రోలి షణ్మత స్థాపకుడైన శంకరాచార్యులు ఎంతో హర్షించి యుండేవాడు

గుప్తులకాలపు స్వర్ణయుగం మనదేశానికి మళ్ళీ రావాలని ఆశిద్దాం.

నేటి క్రైస్తవులు మనదేశాన్ని కబళించాలని ఎంతగట్టిగా ప్రయత్నించినా కుమారజీవుని కాలపు చైనా ప్రజలు, పరిపాలకులు భారతదేశముపట్ల ఎంతో గౌరవంచూపి భారతదేశంనుండి బౌద్ధమతాన్ని క్లిష్టంగా ఏలాగు చేర్చుకొని అలవరచుకన్నారో కుమారజీవుని వ్యాసం తెలుపుతుంది.

చాళుక్యులు, చోళులతోబాటు పల్లవుల వైభవాన్ని మహేంద్ర వర్మ సారస్వత సేవను, రాజరాజనరేంద్రుని గొప్పదనాన్ని, ఖారవేలుని నౌకాదళంగురించిగాని వివరాలు వ్రాసియుంటే చాల బాగుండేది.

భక్తులలో మరికొందర్ని కులశేఖరాళ్వార్, నాయనార్లు ఇత్యాది వారినిగూర్చి చిన్న వ్యాసాలైనా లేకపోవడం, శాతవాహన చక్రవర్తులు విష్ణుకుండినుల ఘనతను చాటు వ్యాసాలు లేకపోవడం పొరబాటే.

తృతీయ సంపుటంలో శైలి సాధారణంగావున్నా ప్రథమ సంపుటంకంటె ప్రోత్సాహకరంగానేవుంది. ఇందులో వైవిధ్యంకూడ బాగానేవుంది. ఈ గ్రంథం విద్యార్థులకు చారిత్రక అంశాలపై ఒక రెడీ రెఫరెంస్ (జంత్రీ) లాగు పనిచేస్తున్నది.

తోడర్‌మల్ జీవితంలోని ఘట్టాలవల్ల నేటి పరిపాలకులు అధికారులుకూడ పాఠం నేర్చుకోవచ్చు. దుండగులైన అధికారులను శిక్షించుటలో ఎవరూ జంకరాదు. తోడర్‌మల్ జనపనార త్రాటి వలన బొక్కసానికి ఎంత నష్టమో గుర్తించి భూముల సర్వేకు సంస్కరణలు ఎలాచేసి బొక్కసానికి ఎల్లా లాభింపజేశాడో తెలుసుకొనాలి. అప్పటి 'తకావా' ఋణాల పద్ధతి మనవద్ద తకావీ ఋణాలుగా రైతులకు వారి పేదకులకుకూడ ఎట్లా లాభిస్తున్నదో తెలిసికోవచ్చు.

ఉదయసింహుని భోగలాలసత రాజస్థాన్‌కు ఎంతముప్పును తెచ్చిపెట్టిందో, రాణాప్రతాప్ ఎన్ని అగ్నిపరీక్షలను ఎదుర్కొన్నదీ కూడ దీనిలో చదవగలరు. రాణాప్రతాప్ హిందువుల స్వాతంత్ర్యాన్ని రక్షించడానికి ఎంత దృఢసంకల్పం కట్టుకున్నాడో అంతకుమించి నియమంతో శత్రువుల స్త్రీలనైన సంరక్షించాడు అనేగొప్ప విషయం రాజపుత్రుల గొప్పదనాన్ని అసలు భారత ధర్మాన్నే గుర్తుకు తెస్తుంది.

గ్వాలియర్ మహారాజాయొక్క సంగీత ప్రియత రేవా ప్రజలకు తాన్‌సేన్‌పై గౌరవం ఎంతవుందో, తాన్‌సేన్‌యొక్క సత్యసంధత మహారాజాచే సత్కరింపబడిన కుడిచేత్తో అక్బరుకు కూడ సలాము చేయనను ప్రతిజ్ఞ, పరమాత్మపై తాన్‌సేన్ పాడిన పాటలకు, ప్రజానురంజనకై పాడిన పాటలకు మధ్య ఎంత తేడాయో అన్నీ చదువరులకే తెలుస్తుంది. అతని నరకుపై తుకారాం ఉదార స్వభావం, దివాలా తీసేది, దారి దోపిడీలు, మోసానికి గురి అవటం, రెండవభార్య వలన అతని ఇంటిలోపోరు, తనకే వైరాగ్యం పుట్టినపుడు తనను బాకీవున్నవారి కాగితాలు పారవేసెది, బ్రాహ్మణుడు ఈసడించు కొన్నప్పుడు తాను వ్రాసిన అభంగాలను పారవేసేది అన్నీ మనకు విడ్డూరంగావున్నా ఆయన స్వార్థం పరమార్థం ఎలా త్యజించాడో చక్కగా బోధపడుతుంది. హిందీపై, గుజరాతీపై మరాఠీ భాష ప్రభావం వున్నట్లు ఈ శీర్షికవల్ల తెలుసుకోవచ్చు. త్యాగరాజు శర్భోజీ మహారాజు ఇచ్చే గౌరవాన్ని రాముని సన్నిధిముందు ఏమీ పనికిరాదని నిశ్చయించి పాడాడు.

తిరువాన్కూరు రాజైన స్వాతి తిరునాళ్ భోజరాజువంటి గుణశీలాలు గలవాడు. కళాప్రియుడు, వాగ్గేయకారుడు. ఉత్తర, దక్షిణ సంగీతశాస్త్రాల బాణీని బాగా అవగాహన చేసికొని కీర్తన, వర్ణం, తిల్లానా, ఖయాలు అన్నిటినీ చక్కగా నడిపిన రాజతడు.

సయ్యద్ అహమ్మద్‌ఖాన్ మొదట్లో ముస్లిముల మేలును మాత్రం కోరి కొన్ని పనులుచేస్తే అవి చివరకు పాకిస్తాన్ స్థాపనకే దారితీసినట్లు స్వర్గీయ రాజేంద్రప్రసాద్ (మొదటి భారత రాష్ట్రపతి) అభిప్రాయం.

ఈశ్వరచంద్రుడు దివ్వవ్యాసానికి ఒక రూపాయినిచ్చి అతన్ని శ్రీమంతున్నెలా చేశాడో, తన నౌకరీని తన మిత్రునికి ఎందుకు ఇచ్చాడో, తన ఆఫీసర్‌ను తరగతికి ఎలా సక్రమంగా రప్పించగలిగాడో, దయానంద్ కఠోరదీక్ష వేదవిద్యార్జనాసక్తి, స్త్రీలను విక్రయించే దురాచారాన్ని ఎలాగ రూపుమాపాడో పండాల దౌర్జన్యంతో తుదకు తన అన్నంలో విషము పెట్టగా వారిని ఎలాగ క్షమించాడో అన్నీ మనకు చాలా వికాసాన్ని కల్గిస్తాయి.

ఈ పుస్తకంలో దేశభక్తులగాథలే ఎక్కువ చక్కగా వ్రాయబడినవి. శివాజీ మొదలగు మహారాష్ట్ర స్వాతంత్ర్యవీరుల చరిత్రలు శరీరాన్ని పులకరింప జేస్తాయి. అహల్యాబాయి, రంజిత్‌సింగ్, టిప్పుసుల్తాను అంగారు తమ పద్ధతిలో దేశభక్తులే. ఝాన్సీలక్ష్మీబాయి తాంతియాటోపేల సాహసం అన్నీ మళ్ళీ సంస్మరింప జేస్తుంది ఈ పుస్తకం.

అనువాదాలలో వచనభేదం వాక్యంలో తెనుగు తనం లేకుండ అన్నీ లోపాలే.

— రాంషియ.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.

# సంకల్పం మీది, సహకారం మాది

తెనుగుదేశంలో ఎక్కడ త్రవ్వినా బౌద్ధ శిథిలాలు కనిపిస్తాయని ఒక కవి రాశాడు. పాపం! అసలు విషయం ఆయనకు తెలియదు.

మన రాష్ట్రంలో ఎక్కడ త్రవ్వినా రకరకాల ఖనిజాలు దొరుకుతాయి. ఖనిజాలనే బంగారు పూసల కంఠహారాన్ని ప్రకృతి మాత ప్రసాదించింది తెలుగు భూమికి

నిరుద్యోగ నివారణ కావ్యంలో
పరిశ్రమలే రసవంతమైనఘట్టాలు

సంకల్పం మీది - సహకారం మాది

ఏదైనా పరిశ్రమ పెట్టాలనే సంకల్పం వుంటే ప్రభుత్వం మీకు అండగానిలుస్తుంది

హైదరాబాదులో గానీ
జిల్లాలలో గానీ

పెట్టుబడి కావాలా, స్థలం కావాలా, నీరు, విద్యుచ్ఛక్తి వసతులు కావాలా, యంత్రాలు కావాలా..............

ప్రభుత్వం చేసే రకరకాల సౌకర్యాలు మీకు తెలుసుగదా
ఇంకా ఎందుకు సందేహిస్తారు?

No 30/75-76 సమాచార, పౌర సంబంధ శాఖ హైదరాబాదు.

# అమృతాంజన్ లిమిటెడ్

## 75 సంవత్సరాల పైగా గృహౌషధములు తయారుచేస్తున్నవారు!

- అమృతాంజనం బాధానివారిణి
  తలనొప్పి, ఒళ్ళునొప్పులు, బెణుకులు, జలుబు, దగ్గు, కండరాల నొప్పులకు.
- అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్
  పసిబిడ్డల అజీర్ణానికి, పళ్ళు వచ్చేటప్పుడు కలిగే బాధలకు.
- అమృతాంజన్ డెర్మల్ అయింట్ మెంట్
  తామర, తీట, గజ్జి వగైరాలకు.
- అమృతాంజన్ ఇన్ హేలర్
  జలుబుచేసి ముక్కుదిబ్బడ, తుమ్ములు వగైరాలకు.
- అనోలియమ్-కోల్డ్ రబ్
  దగ్గు జలుబులను పారద్రోలే అమోఘమైన ఒక కొత్త శక్తి.
- సాలోపెన్-బాధానివారిణి మాత్రలు
  తలనొప్పి. ఫ్లూ, ఒళ్ళు నొప్పులకు

...ఇండియాలోను,
ఇతర దేశాలలోను
పేరు పొందినవి.

అమృతాంజన్ లిమిటెడ
మద్రాసు-4

